

కర్రమ్
కుర్రమ్

# లైట్
# 'ఎన్‌క్రిస్ప్'
# క్రన్‌చీ

7 రుచులు–
ఎంతో రుచికరమైనది
మరియు ఎంతో కరకర మంటుంది.



లిజ్జత్‌దార్



# లిజ్జత్ పాపడ్

Mudra B: 5221 Tel

# PARRYS



స్నేహితులారా!
మళ్ళీ మనం మరొకసారి కలుసుకుంటున్నాము. ఈసారి నేను మీకోసం ఏమి తెచ్చానోనని మీరు ఆశ్చర్యపోతూ వుంటారు గదూ! నేను క్యారమిల్క్, కాఫీబైట్ మరియు ట్రైమీ తెచ్చానని చెప్పాలా అయితే అవి అంతులేని వినోదం తెచ్చాయి!







THE KING OF SWEETS

## లేడీబర్డ్ పాచికల ఆట ఆడదాము!

ఇది ఎంతో వినోదంతో కూడిన ఆట! మీరు రెండు పనులు చేస్తారు — భలే తమాషా బొమ్మ గీస్తారు మరియు పాచికలు విసిరి భలే తమాషా చేస్తారు.

మీకు కావలసినవి : పాచికలు
1 కాగితం (ప్రతి ఆటగాడికి)
1 పెన్సిల్ లేక నల్లరంగు పెన్ను (ప్రతి ఆటగాడికి)






ఈ ఆట లక్ష్యం ఏమిటంటే పదమూడు భాగాలు వుండే లేడీబర్డ్ బొమ్మని పూర్తిచేయడం. ప్రతి భాగానికి ఒక ప్రత్యేక విలువ వుంటుంది (అంటే ప్రతి భాగానికి ఒక ప్రత్యేక సంఖ్య వుంటుంది). పాచికల మీద వుండే అంకెలు లేడీబర్డ్ ఒక్కొక్క భాగానికి చెందుతాయి. ఆ అంకెలు యిలా వుంటాయి!

1 - శరీరం ● 3 - ఆరుకాళ్ళలో ప్రతి ఒక్కదానికి ● 5 - రెండు మీసాలలో ఒక్కొక్కదానికి
● 2 - తల ● 4 - రెండు కళ్ళలో ఒక్కొక్కదానికి ● 6 - తోక.

ఈ ఆటని ఎంతమందయినా ఆడవచ్చు. పాచికలు విసరడానికి ఒకరి తర్వాత మరొకరికి వంతు వస్తుంది. ముందర '1' వచ్చేలా విసిరితేనే (అంటే శరీరంతో ప్రారంభించా లన్నమాట) ఆటలో ముందుకుసాగి మిగతా భాగాలు పూర్తిచేయవచ్చు. అంతేకాదు 'తల' చిత్రించిన తర్వాతే 'కళ్ళు' మరియు 'మీసాలు' చేర్చాలని గుర్తుంచుకోండి. ఎవరయితే లేడీబర్డ్ చిత్రం ముందుగా పూర్తిచేస్తారో వారు ఆటలో నెగ్గినట్లు. అప్పుడే మీరు మళ్ళీ యింకొకసారి ఆట మొదలుపెట్టవచ్చు. మీరు యింకొక పక్షి లేక జంతువుని చిత్రించేలా కూడా ఈ ఆట ఆడుకోవచ్చు. ఉదాహరణకి ఒక చేపని చిత్రించుకునేలా ఈ ఆటని ఆడుకోవచ్చు. ఈ విధంగా అనేక రకాలుగా ఆడుకోవచ్చు. కొత్త జంతువులు, సరికొత్త ఆటలు కావాలంటే ఎన్నెన్నో!





# PAGE

ప్యారీస్ మిఠాయిలు మరియు బిస్కట్లు అందరికీ ఇష్టం!

## అన్నీ ఒక గంటలోనే!

మీకు తెలుసా? ఒక గంటలో మీరు 2,500 మాటలు మాట్లాడగలరు (మిమ్మల్ని మాట్లాడనిస్తే!), 500 సార్లు కళ్లు మిటకరించవచ్చు మీ గుండె 2 ఔన్సుల రక్తాన్ని పంపుచేస్తుంది. మీ శరీరం 1 లీటర్ నీళ్లని మరిగించడానికి కావలసిన శక్తిని కోల్పోతుంది. మీ చేతి వేళ్ళ గోళ్ళు అంగుళంలో 327వ వంతు పెరుగుతాయి! అవా అలుపు సొలుపూ లేని శరీరం గదా మీది!!

COFFY BITE

## మీరూ ప్యారాట్రూపర్ అవండి


FIG. 1

మీకు కావలసినవి
పెద్ద జేబురుమాలు లేక
పేపర్ నాప్‌కిన్; సన్నని దారం;
చిన్న బిరడా ;కాగితవు షీటు; కత్తెర;
సెలోటేప్; రంగులు; రంగుల పెన్నులు
లేక రంగుల పెన్సిళ్లు.

సినిమాలలోనూ, పుస్తకాలలోనూ ప్యారా ట్రూపర్లని చూసినప్పుడు మీకు అసూయ కలుగుతుంది కదా ఇప్పుడు మీకు మంచి అవకాశం వచ్చింది. మీ స్వంత ప్యారాషూటుని మీరు తయారుచేసుకోవచ్చు.

Try-Me


FIG. 2

FIG. 3

ఒకొక్కటి 30 సెం.మీ (12 అం॥) పొడవు వుండేటట్టు నాలుగు దారం ముక్కలు కత్తిరించండి. జేబు రుమాలు నాలుగు మూలలకి నాలుగు దారం ముక్కలు కట్టండి (చిత్రం 1 లో చూపించినట్లు). బిరడా మధ్య చుట్టూ ఒక దారం ముక్క గట్టిగా బిగించి కట్టండి (చిత్రం 2 లో చూపించినట్లు) ఇప్పుడు జేబురుమాలుకి కట్టిన దారాలు బిరడాకి కట్టిన ఈ దారానికి కట్టండి (చిత్రం 3 లో చూపించినట్లు). ఒక కాగితం మీద ప్యారాషూట్ నుంచి దిగే వ్యక్తి చిత్రం (చిత్రం 4 లో చూపించినట్లు) గీసి దానిని కత్తిరించి బిరడాకి అతికించండి. ఇప్పుడు ఏమిచేయాలో తెలుసా? మేడ మీదనుంచి మీ ప్యారాషూటుని వదిలిపెట్టండి. మీ ప్యారాట్రూపర్ అలా క్రిందికి దిగడం చూడండి!


FIG. 4

**ఇది నిజం!**
పక్షులు నేల మీద వున్నప్పుడు ఎప్పుడూ పాడవు. చెట్ల కొమ్మల మీద కూర్చున్నప్పుడే పాడతాయి.

## ఈ నీడలో ఏ చేప సరిగ్గా సరిపోతుంది

అది చేప 1, చేప 2, చేప 3, చేప 4 లేక చేప 5 దేని నీడ?







(2 వ పేజీ చూడండి)

CUT AND KEEP

## ఇప్పుడు! సెరెలాక్ లాభాన్ని డబ్బు ఆదా చేసే రీఫిల్ ప్యాక్ ద్వారా పొందండి

ఆధునికమైనది. అనువైనది




(సరుకు మార్చి వేసేందుకు వీలు లేని, గాలి చొరబడకుండా సీలు చేసిన పెట్టెలో బ్యాగ్)

4 నెలల నుంచి మీ పాపాయికి, పాలతోబాటు అదనంగా ఘన పదార్థాలు కావాలి. పాపాయికి సెరెలాక్ లాంటి దీనిని ప్రారంభించేందుకు యిదే సరైన సమయం. ప్రతి సెరెలాక్ మోతాదులోను పోషక పదార్థాలన్నీ పూర్తిగా ఉంటాయి. పాపాయిలకు సెరెలాక్ రుచి ఇష్టం. సెరెలాక్‌ని తయారు చేయడం కూడా ఎంతో సులువు–దీనిని ముందుగా కాచిన వెచ్చటి నీళ్ళల్లో కలిపితే చాలు. సెరెలాక్ మీరు ఎంచుకునేందుకు మూడు రకాలను సమకూరుస్తోంది–సెరెలాక్ వీట్, వీట్-ఆపిల్, వీట్-ఆరంజ్.

ప్రతి బ్యాగ్‌ని గాలి చొరబడకుండా సీలు చేయడం ద్వారా రీఫిల్ ప్యాక్‌లోను సెరెలాక్ వీట్ మంచితనాన్ని చెక్కు చెదరకుండా కాపాడతారు. తరువాత దానిని బయటి పెట్టెలో ప్యాక్ చేస్తారు. ప్రతి రీఫిల్ ప్యాక్ కూడా నెస్లె వారి నాణ్యత హామీతో లభిస్తుంది.

సెరెలాక్‌ని తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు ప్యాక్ మీద ఉన్న సూచనలను జాగ్రత్తగా పాటించండి. రీఫిల్‌ని తెరిచిన వెంటనే అందులోని పదార్థాన్ని, గాలి చొరబడని డబ్బాలోకి మార్చండి.

ఉచితం
సెరెలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరెలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008




R K SWAMY/FSL/5340 TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''స్వప్రయోజనం''] కు ఆధారం, డా॥ గంగిశెట్టి శివకుమార్ రచన. కొన్ని మూఢవిశ్వాసాలకు, పండితపామర భేదం లేకుండా పట్టి పీడించేశక్తి వుంటుంది. అందుకు కారణం, అది అతి ప్రాచీనమేగాక, ఆచార, సంప్రదాయ గతం కావడం. ''రాజుగారికలలు'' అన్న కథలో ఇది చక్కగా నిరూపింపబడింది.

## అమరవాణి

అజరామరవత్ ప్రాజ్ఞో, విద్యామర్థం చ చింతయేత్,
గృహీత ఇవ కేశేషు, మృత్యునా ధర్మమాచరేత్.

[వివేకవంతులు, జరామరణాలు లేవన్న ఉత్సాహంతో విద్యా సంపదను ఆర్జించాలి; అయితే, మరణం అప్పుడే తమ జుట్టు పట్టుకున్నదన్న దృఢచిత్తంతో ధర్మమార్గంలో చరించాలి!]

సంపుటి 84 ఫిబ్రవరి '89 సంచిక 2

విడి ప్రతి : 3-00 :: సంవత్సర చందా : 36-00





# జెమ్స్ బాండ్ సాహస గాధలు!




























## క్యాడ్‌బరీస్ జెమ్స్

జోరుజోరుగా పకపకలు, వికవికలు!

# చందమామ కబుర్లు



## పుష్పకవిమానాలు

మన పురాణగాథలలో కనిపించే పుష్పకవిమానాలు కేవలం కవుల కల్పన మాత్రమే కావనీ, అవి నిజమేననీ—ఇటలీకి చెందిన విజ్ఞానవేత్త డా॥ రోబర్టో పినోటీ అభిప్రాయ పడుతున్నారు. ఇటీవల బెంగళూరులో జరిగిన అంతర్జాతీయ వ్యోమ విజ్ఞాన సదస్సులో ప్రసంగిస్తూ, ఆయన మన ప్రాచీన గ్రంథాలను పరిశోధించినట్టయితే పుష్పక విమానాల నిర్మాణానికి సంబంధించిన విజ్ఞానం వెలుగులోకి రావచ్చునని అభిప్రాయ పడ్డాడు!

## గగనంలో వెలుగు వలయం!

2000 సంవత్సరం నాటికి ఆకాశంలో బ్రహ్మాండమైన ఉంగరం ఆకారంలో ఒక కాంతి వలయాన్ని చూడనున్నాము. ఐక మత్యానికీ, పరిపూర్ణతకూ, శాంతికీ సంకేతంగా ఈ వెలుగు వలయాన్ని—మనం నూతన సహస్రాబ్దంలో ప్రవేశిస్తున్న సందర్భంగా ఆవిష్కరించనున్నారు!





## కుజగ్రహంలో మనుషులు!

క్రీ. శ. 2001—2010 మధ్య కాలంలో అమెరికా, 'కుజగ్రహ చంద్రులకూ, కుజగ్రహానికీ మనుషులను పంపనున్నది.

## అద్భుత మేధా విలాసం!

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన గణిత మేధావి ప్రొఫెసర్ ఎర్నో రూబిక్ రూపొందించిన క్లిష్టమైన ప్రహేళికలను—పదకొండేళ్ళ సమీర్ మెహ్రా, అతడి చెల్లెలు తొమ్మిదేళ్ళ కానికా అవలీలగా పరిష్కరించగలిగారు. ప్రహేళికలను సృష్టించిన ప్రొఫెసర్‌గారికే వాటికి సరైన సమాధానాలు కనుగొనడానికి ఎంతో కాలం పట్టింది. అటువంటి లెక్కలను సమీర్ 25 సెకండ్లలోనూ, కానికా రెండు నిమిషాలలోనూ సునాయాసంగా పరిష్కరించగలిగారు.



# సుంకం వసూలు

రామాపురం, విష్ణుపురం పక్కపక్కన వున్న ఊళ్ళే అయినప్పటికీ, అవి రెండూ వేరువేరు రాజ్యాలకు చెందినవి. ఆ ఊళ్ళ సరిహద్దులవద్ద, రెండు రాజ్యాల రాజోద్యోగులూ, వర్తకుల నుంచి సుంకాలు వసూలు చేస్తూండేవారు. రాజోద్యోగులు, సరుకులతో వచ్చిన బళ్ళను లెక్క పెట్టి, బండికి ఐదు వరహాల చొప్పున సుంకం వసూలు చేసేవారు. ఒక వర్తకుడు, ఎక్కువ బళ్ళ మీద సరుకులు తెస్తే, ఐదు బళ్ళలో ఒక బండిని సుంకం లేకుండా వదిలిపెట్టేవారు.

ప్రధానుడు అనే వర్తకుడు, ఐదు బళ్ళ మీద సరుకులు వేసుకుని, విష్ణుపురం నుంచి రామాపురానికి బయలుదేరాడు. రామాపురం సరిహద్దులవద్ద, రాజభటులు బళ్ళను ఆపారు. ప్రధానుడి బళ్ళ ముందు యింకా అనేక బళ్ళు, సుంకం కట్టడం కోసం, నిలబడి వున్నాయి.

ప్రధానుడు తన సలహాదారైన చంద్రికుడితో, "వాళ్ళంతా సుంకాలు చెల్లించి కదిలేసరికి, ఆలస్యమవుతుంది. నువ్వు వెళ్ళి, మన వంతు రాగానే, బళ్ళకు సుంకం చెల్లించిరా," అని, చంద్రికుడికి ఇరవై వరహాలు యిచ్చాడు.

చంద్రికుడు వెళ్ళి, పది నిమిషాలలో తిరిగి వచ్చి, ఇరవై వరహాలనూ ప్రధానుడి కిస్తూ, "మన పని పూర్తయింది. మన బళ్ళకు సుంకం కట్టనవసరం లేదు," అన్నాడు.

ప్రధానుడు ఆశ్చర్యపోతూ, "మనవి ఐదు బళ్ళు కదా! వాళ్ళు ఒక్క బండికూడా సుంకం తీసుకోలేదా?" అని అడిగాడు.

చంద్రికుడు నవ్వుతూ, "మన ముందున్న వర్తకులందరికీ, ఒక్కొక్క బండి మాత్రమే వున్నది. నేను వాళ్ళతో—అందరం కలిసి, ఒకేసారి సుంకం చెల్లిస్తే, త్వరగా యిక్కడి నుంచి కదలవచ్చని చెప్పాను. వాళ్ళు సుంకం డబ్బులు, నా చేతిలో పెట్టారు. అప్పుడు నేను రాజోద్యోగులవద్దకుపోయి, మొత్తం అక్కడ వున్న బళ్ళు మన ఐదు బళ్ళతో కలిపి, ఇరవై ఐదని చెప్పాను. నియమానుసారం, రాజోద్యోగులు ఐదు బళ్ళకు సుంకం తీసుకోలేదు," అని చెప్పాడు.

చంద్రికుడిని, ప్రధానుడు మెచ్చుకుని, అతడి వేతనాన్ని రెట్టింపు చేశాడు. —రాంబాబు





# రాజుగారి కలలు

వత్సలదేశాన్ని పాలించే చంద్రసేన మహారాజుకు, రకరకాల మూఢనమ్మకాలుండేవి. అలాంటి వాటిలో ముఖ్యమైనది, కలలు నిజమవుతాయనే గుడ్డినమ్మకం ఒకటి.

రాజు శౌర్యశాలీ, పరిపాలనాదక్షుడూ కాదు. ఇందువల్ల రాజ్యపాలనలో ఎటువంటి అవకతవకలూ జరగకుండా మంత్రీ, సేనాపతీ ఎల్లవేళలా అతి జాగరూకులై వుండేవారు.

ఒక రోజు రాత్రి రాజుకు, ఒక కల వచ్చింది. ఆ కలలో రాజు నిద్రిస్తూండగా శయనాగారం లోపలికి ఒక త్రాచుపాము ప్రవేశించి, రాజును కాటు వెయ్యడానికి శయ్యను ఎక్కబోతున్నది. అంతలో కాపలాభటు డొకడు శయనాగారం తలుపులు దడదడాబాది, రాజును నిద్ర లేపి, పామును చంపేశాడు.

మర్నాడు చంద్రసేనుడు, అలవాటు ప్రకారం, ఆ కల గురించి మంత్రి, సేనాపతులకు చెబుతూంటే, అక్కడే వున్న నందుడు అనే భటుడు విన్నాడు. వాడు చాలా కాలంగా రాజుకు వున్న, యీ కలల నమ్మకాన్ని, తన లాభం కోసం ఉపయోగించుకోవాలని, తగినసమయంకోసంకాచుకుని వున్నాడు. వాడు యీ కల గురించి విని, ఒక ఉపాయం ఆలోచించాడు.

వాడు కొన్ని దినాలు గడవనిచ్చి, ఒక రాత్రి అంతఃపురంలో కాపలా తిరుగుతూ, పాములవాడి నుంచి కొని తెచ్చిన నల్ల త్రాచును, రాజు నిద్రిస్తున్న శయనాగారంలోకి వదిలాడు. తర్వాత హడావుడిగా తలుపులు బాది రాజును నిద్ర లేపాడు.

రాజు లేచి వచ్చి తలుపులు తెరిచి, "ఈ అర్ధరాత్రి వేళ ఏం ముంచుకు వచ్చింది ?" అన్నాడు కోపంగా.

మల్లవరపు మనోహరరెడ్డి



''ఏలినవారు మన్నించాలి! కిటికీ గుండా నల్లత్రాచు లోపలికి వెళ్ళడం చూసి, భయంకొద్దీ తొందరపడ్డాను,'' అన్నాడు నందుడు.

రాజు ఆశ్చర్యపోయి, శయనాగారంలో వెతికించేసరికి, నల్లత్రాచు కనబడింది. భటులు దాన్ని చంపారు. రాజు, నందుడిని మెచ్చుకుని తన మెడలో వున్న విలువైన హారాన్ని తీసి, బహుమతిగా యిచ్చాడు. తెల్లవారాక, ఆయన తన కల నిజమయిందని మంత్రి, సేనాపతులతో గొప్పగా చెప్పుకున్నాడు.

ఇది విన్న మంత్రీ, సేనాపతీ— నందుడు తెలివిగా రాజును మోసపుచ్చాడని ఊహించారు. అయితే, ఆ విషయం రాజుకు చెప్పినప్పటికీ వినిపించుకోడు కాబట్టి, వాళ్ళు రాజుతో ఏమీ అనలేదు.

మర్నాడు వాళ్ళు, నందుడిని పిలిపించి, ''నిజం చెప్పు! రాజుగారి శయనాగారంలోకి పామును వదిలింది నువ్వేకదా?'' అని నిలదీశారు.

నందుడు ఒప్పుకోక మొండికేసేసరికి, సేనాని వాణ్ణి గట్టిగా కొట్టి వాడి చేత నిజం చెప్పించాడు.

మంత్రి వాణ్ణి మందలించి, ''ఒరే, బహుమతికి కక్కుర్తిపడి, నువు చేసిన పనివల్ల రాజు మరింత మూర్ఖుడైపోతాడు. రేపు ఆయన మూర్ఖంగా ప్రవర్తించి లేనిపోని అనర్థాలు తెచ్చిపెడితే, బాధ్యత వహించేది ఎవరు? ఇంకెన్నడూ యిలాంటి పనులు చేయకు,'' అని హెచ్చరించి పంపివేశాడు.

సేనాపతి కొట్టినందుకు, నందుడికి ఆయనపై చాలా కోపం వచ్చింది. వాడు సమయం దొరికిననాడు, సేనాపతిపై పగ తీర్చుకోవాలనుకున్నాడు.

ఇది జరిగిన కొంత కాలానికి, రాజు మరొక కలగన్నాడు. ఆ కలలో రాజు మీద ఎవరో శ్మశానంలో చేతబడి చేస్తున్నారు. ఆ తంతు జరుపుతున్నవాళ్ళెవరూ రాజుకు స్పష్టంగా కనిపించలేదు. అయితే, ధరిం

చిన దుస్తులనుబట్టి ఒకడు మాత్రం, రాజోద్యోగి అని తెలుసుకోగలిగాడు.

మర్నాడు రాజు, ఆ కల గురించి మంత్రి, సేనాపతులకు చెప్పి, "నా కలలు నిజమవుతాయని మొన్నటితో తేలిపోయింది గదా! ఈ కలవల్ల నాకు, మన కొలువు లోనే ఎవరో శత్రువున్నట్టు తెలుస్తున్నది. వాడు నాకు చేతబడి చేయించకముందే, ఎలాగైనా వలపన్ని పట్టుకోవాలి. ఆ పనేదో మీరు చూడండి!" అన్నాడు.

ఆ సమయంలో, అక్కడే వున్న నందుడు యిది విన్నాడు. దానిని గురించి ఆలోచించగా వాడికి, సేనాపతి మీద పగ తీర్చుకునేందుకు, ఒక చక్కటి మార్గం తోచింది.

కొన్నిదినాలు గడవనిచ్చి వాడు, తప్పి పోయిన గేదెను వెతికేందుకని కొలువులో సెలవు తీసుకున్నాడు. తర్వాత తిన్నగా పోయి మంత్రాల మరిడయ్యను కలుసు కుని, వాడి సాయంతో శ్మశానంలో మూడు రంగులతో పెద్దముగ్గు వేయించాడు. ముగ్గు మధ్యనపుర్రె, ఎముకలు వుంచి, పుర్రెను కోడి రక్తంతో తడిపి, నిమ్మ కాయలు కోసి, కుంకం అద్ది, వాటిని ముగ్గుకు మూలమూలా వుంచాడు, మరిడయ్య. ఈ పని ముగిశాక మట్టితో ఒక బొమ్మనుచేసి, పుర్రెముందు పెట్టాడు.



ఈ తంతు అయాక నందుడు, రాజును కలుసుకుని, "మహారాజా, తప్పిపోయిన గేదె కోసం వెతుకుతూంటే, శ్మశానంలో మన సేనాపతి, ఒక మంత్రగాడితో మీకు చేతబడి చేయించడం కంటబడింది. ఆ మంత్రగాడు ఏవో మంత్రాలు చదువుతూ, మధ్య మధ్యన మీ పేరు ఉచ్చరిస్తూ, మట్టిబొమ్మకు మేకులు దించుతున్నాడు. నన్ను చూడగానే వాళ్ళు పారిపోయారు," అన్నాడు.

ఇది విని రాజు నమ్మలేక, శ్మశానానికి వెళ్ళి చూసేసరికి, అక్కడ నందుడు చెప్పిన విధంగా వున్నది. రాజు సేనాపతిపై ఆగ్రహపడి, వెంటనే అతణ్ణి ఖైదు చేయిం



ఇది జరిగిన కొంత కాలానికి రాజు చంద్రసేనుడు, నందుడు శత్రుదేశపు రాజుతో చేతులు కలిపి, తనను హత్య చేసినట్టు కలగన్నాడు. ఆయన నిలువెల్లా వణికిపోతూ మేలుకుని, భటులను పిలిచి, నందుణ్ణి వెంటనే బంధించమని ఆజ్ఞాపించాడు.

పహరాతిరుగుతూ రాజాజ్ఞ విన్న నందుడు, అప్పటికప్పుడే పారిపోయాడు. మర్నాడు వాడు మంత్రి ఇంటికి వెళ్ళి, ఆయన కాళ్ళ మీద పడి, "పిల్లలు కల వాణ్ణి. మీ మాట వినక గొంతు మీదికి తెచ్చుకున్నాను. ఈ ప్రమాదం నుంచి మీరే కాపాడాలి!" అని వేడుకున్నాడు.

మంత్రి కొంతసేపు ఆలోచించి, "సరే, నిన్ను దాచివుంచి, రాజు దగ్గిర ఒక నాటకం ఆడందే, ఆయన యీ కలల మాయలోంచి బయటపడలేడు. కాబట్టి నిన్ను తప్పక రక్షిస్తాను!" అని, ఆ రోజు నుంచీ నందుడిని, తన ఇంటిలోనే దాచి వుంచాడు.

ఎన్నిదినాలు గడిచినప్పటికీ, నందుడి జాడ తెలియకపోయేసరికి, రోజూ వాడు తనను హత్య చేస్తున్నట్టు రాజు కల గనసాగాడు. ఆయన, ఒకనాడు మంత్రితో, "ఎలాగైనా, ఆ నందుణ్ణి ఒకటి, రెండు రోజుల్లో బంధించండి. అసలే నా కలలు

చాడు. తర్వాత నందుణ్ణి ఎంతగానో మెచ్చుకుని, విలువైన బహుమానం కూడా యిచ్చాడు.

మంత్రి, నందుడిని పిలిపించి, "నువ్వు రాజు వైరిని ఆసరా చేసుకుని, సేనాపతి మీద కక్షసాధించావు. రాజు ఎదట నిజం ఒప్పుకుని, సేనాపతిని విడిపించేందుకు సహకరించు. అప్పుడు నీ తప్పులను క్షమించి, రాజుకు చెప్పి, నీకు శిక్షపడకుండా చూస్తాను," అన్నాడు.

అందుకు నందుడు నవ్వి, "రాజుగారు నా చేతిలో మనిషి. నేను తలచుకుంటే, ఏదో ఒక కల ద్వారా మిమ్మల్ని కూడా ఖైదులో పెట్టించగలను," అన్నాడు.

నిజమవుతున్నాయి. వాడు తప్పక నన్ను హత్య చేస్తాడు!'' అన్నాడు విచారంగా.

మంత్రి రెండు రోజులు గడవనిచ్చి, రాజును కలుసుకుని, ''మహారాజా, నందుడు తన గ్రామంలో పాముకాటుకు గురి అయి చనిపోయి రెండు రోజులయిందట. ఇప్పుడే వాళ్ళ గ్రామం వాడొకడు వచ్చి చెప్పాడు,'' అన్నాడు.

నందుడు చనిపోయాడని వినేసరికి, రాజుకు ఎక్కడలేని ఆనందం కలిగింది. ఆ రోజు నుంచీ ఆయనకు కలలలో నందుడు కనిపించనేలేదు.

వారం రోజుల తర్వాత మంత్రి, రాజును కలుసుకుని ''మహారాజా, యిప్పుడు కూడా నందుడు కలలో కనిపిస్తున్నాడా?'' అని అడిగాడు.

రాజు పెద్దగా నవ్వి, ''నందుడు చచ్చిపోయాడు గదా! కలల్లోకి ఎలా వస్తాడు?'' అన్నాడు.

''నందుడు బతికే వున్నాడు. కలలు కేవలం భ్రమమాత్రమే అని తెలియజేయడానికి వాణ్ణి, నేనే దాచాను. చనిపోయాడని తెలిసేంతవరకూ, రోజూ కలలోకి వచ్చిన నందుడు, చనిపోయాడనేసరికి — బతికి వుండే కలలోకి రావడం లేదంటే, కలలు ఎంత బూటకమో ఆలోచించండి. కొన్ని కలలు కాకతాళీయంగా నిజమవుతుంటాయి. అంతమాత్రాన ప్రతి కలా నిజమవుతుందని అర్థాలు వెతకడం మౌఢ్యం అనిపించుకుంటుంది,'' అన్నాడు మంత్రి.

''మరి నిజమైన, ఆ రెండు కలల గురించి మీరేమంటారు?'' అని అడిగాడు రాజు.

''అవి నందుడు చేసిన మోసం!'' అని మంత్రి, నందుడిని పిలిపించాడు.

నందుడు వచ్చి, రాజు కాళ్ళ మీద పడి, జరిగిందంతా చెప్పి, క్షమించమని వేడుకున్నాడు.

ఇంత జరిగాక రాజు చంద్రసేనుడు, సేనాపతిని విడుదల చేయించి, కలలను నమ్మడం మానుకున్నాడు.





# వీలునామా రహస్యం

ధర్మరాజు అనే జమీందారు, పేరులోనే కాక ఇతర్లకు సహాయం చేయడంలో కూడా, ధర్మరాజు అని పేరు పొందాడు. అయనకు ఎన్ని పూజలూ, వ్రతాలూ చేసినా సంతానం కలగలేదు. ఇలా వుండగా, ధర్మరాజు భార్యకు జబ్బుచేసి హఠాత్తుగా మరణించింది. ఆమె చనిపోయినప్పటి నుంచీ, ఆమె మీది బెంగతో మనోవ్యాధికి గురిఅయిన, ధర్మరాజు నెల తిరక్కుండానే చనిపోయాడు.

ధర్మరాజు దగ్గిర పని చేసేవాళ్ళలో, యిద్దరు ఆయనకు బాగా నమ్మకస్థులు. ఒకడు ఇంటి పని చేసే రామయ్య, రెండవ వాడు తోట పని చేసే పోలయ్య. తమకు వున్న ఒక్క ఆధారం పోవడంతో, వాళ్ళిద్దరికీ దిక్కుతోచనిపరిస్థితి ఏర్పడింది.

ఆ సమయంలో పొరుగూరి న్యాయాధికారీ, ధర్మరాజు స్నేహితుడూ అయిన పుండరీకాక్షయ్య, అక్కడికి వచ్చి, వాళ్ళతో, ''మీ యజమాని ధర్మరాజుగారు చనిపోయేముందు, నన్ను సంప్రతించి ఒక వీలునామా రాశాడు. దాని ప్రకారం, ఆయన నివసించిన భవనాన్ని, అనాథశరణాలయానికి యిచ్చి వేయవలసి వుంటుంది. అంతేకాక, మీ యిద్దరికీ చెరొక పదివేల రూపాయిలు యివ్వమన్నారు,'' అన్నాడు.

''అయ్యా, మరి మిగిలిన ఆస్తి అంతా ఏం చేస్తారు?'' అని అడిగాడు పోలయ్య.

''ధర్మరాజుగారు ఆస్తిపరులైనా, దానధర్మాలు విపరీతంగా చేయడంతో, ఆయనకంటూ యింకా మిగిలిన ఆస్తి ఏమీ లేదు,'' అన్నాడు పుండరీకాక్షయ్య.

ఆ రోజు రాత్రి పోలయ్య, పుండరీకాక్షయ్య ఊరికి వెళ్ళి, ఆయనను కలుసుకుని, ''అయ్యా, మీ మాటలు నాకు నమ్మ

పెంటకోట సోమినాయుడు

ఆయన జీవితచరిత్ర పదిమందికీ తెలిసేలా ప్రచారం చేయించాడు.

ఇక, ధర్మరాజుగారి వీలునామా గురించిన, వివరాలేవీ తెలియని రామయ్య, తన దగ్గిరున్న డబ్బుతో పేదలకు అన్న దానం చేస్తూ, వాళ్ళు, తన దానగుణాన్ని పొగిడినప్పుడు మాత్రం, "ఈ డబ్బు నాది కాదు. ధర్మరాజుగారు ఇచ్చినది. పొగడ్తలన్నీ వారికే చెందాలి," అనేవాడు.

కొంతకాలం గడిచిన తర్వాత, పుండరీకాక్షయ్య, ధర్మరాజుగారి గ్రామం వచ్చి, అందరినీ ఒకచోట సమావేశపరిచి, ధర్మరాజుగారి వీలునామాలో ఏమున్నదో చదివి వినిపించి, "వారిచ్చిపోయిన లక్ష రూపాయలు పోలయ్యకు చెందాలా? రామయ్యకు చెందాలా?" అని అడిగాడు.

అందుకు, అక్కడ చేరినవాళ్ళందరూ, "ధర్మరాజుగారు, వికలాంగులకూ, పేదలకూ దానధర్మాలు చేస్తూ, వారిని ఆదుకునేవారు. వారికి కీర్తికాంక్షలేదు; వారిలాగే పేదసాదలకోసం ధనాన్ని ఖర్చు చేస్తున్న రామయ్యే, ఆ లక్ష రూపాయలకూ అర్హుడు," అన్నారు.

పుండరీకాక్షయ్య లక్షరూపాయలనూ, రామయ్యకు ఇచ్చి, పోలయ్యతో, "పోలయ్యా, వీలునామాలో ఏమున్నదో తెలుసుకునేందుకు, పొరుగూరి న్యాయాధికారినైన నాకే, వెయ్యి రూపాయిలు లంచం ఇచ్చావు. ఇదుగో, ఆ వెయ్యి రూపాయిలూ తీసుకో. మీ ఇద్దరి స్వభావాలూ తెలుసుకోవడం, నాబాధ్యత గనక, ఆనాడు ఆ డబ్బు తీసుకున్నాను," అన్నాడు.

అవమానంతో తల వంచుకున్న పోలయ్యకు, రామయ్య తన వద్ద వున్న లక్షరూపాయిల లోంచి పదివేలు ఇస్తూ, "పోలయ్యా, నీకు తోచిన పద్ధతిలో, మన యజమాని గురించి, వారిచ్చిపోయిన డబ్బు ఖర్చుపెట్టావు. ఈ మొత్తం నీ దగ్గిర వుంచుకో!" అన్నాడు.

తర్వాత మిగిలిన డబ్బుతో రామయ్య, ధర్మరాజుగారి పేర సత్రం కట్టించి, పేదలకు సాయం చేస్తూ తృప్తిగా జీవించాడు.



బుద్ధికావడం లేదు. ధర్మరాజుగారు విరివిగా దానధర్మాలు చేసినా, వారు చాలా గొప్ప ఆస్తిపరులు. చనిపోయే నాటికి వారి దగ్గిర కేవలం ఇరవైవేల రూపాయిలు మాత్రమే వున్నవనడం, ఏ మాత్రం నమ్మలేని విషయం,'' అన్నాడు.



పుండరీకాక్షయ్య, జవాబుచెప్పేందుకు తటపటాయించడం చూసి, పోలయ్య ధైర్యం తెచ్చుకుని, ఆయన చేతిలో వెయ్యి రూపాయిలు పెట్టి, ''నాకు పదివేల రూపాయిలు తమ చేతిమీదుగా యిచ్చారు కనక, యీ చిన్న మొత్తాన్ని కృతజ్ఞతా పూర్వకంగా యిచ్చుకుంటున్నాను. తమరు దాపరికం లేకుండా, ధర్మరాజుగారి వీలు నామా గురించి చెప్పండి,'' అని కోరాడు.

అందుకు పుండరీకాక్షయ్య చిన్నగా నవ్వి, ''నువ్వు చాలా తెలివిగలవాడివి, పోలయ్యా! నేనేదో దాస్తున్నానని బాగానే పసికట్టావు. సంగతి యిది: ధర్మరాజుగారి ఆస్తిగా, మరొక లక్షరూపాయిల రొఖ్ఖం వున్నది. అయితే ముందుగా నీకూ, రామయ్యకూ పదివేలరూపాయిల చొప్పున యిచ్చి, మిమ్మల్ని ఒక పరీక్షకు గురి చేశారు. మీకిచ్చిన ధనాన్ని, మీరెలా ఖర్చు పెడతారో నన్ను గమనించమన్నారు. ఎవరు ఖర్చుపెట్టేతీరు తన ఆత్మకు శాంతి కలిగిస్తుందో వాళ్ళకు ఆ లక్ష యివ్వ మన్నారు. ఇదంతా, ఆయన రాసిన వీలు నామాలో వున్నది. ధర్మరాజుగారి ఆత్మకు సంతోషం కలిగించే పనులేమిటో నాకే గాక, వారి నెరిగిన చాలామందికి కూడా తెలుసు,'' అన్నాడు.

ఇది వినగానే పోలయ్యకు చాలా సంతోషం కలిగింది. అతను ఇంటికి తిరిగి పోయి, తన దగ్గిరున్న డబ్బుతో శిల్పుల చేత ధర్మరాజుగారి విగ్రహం చేయించి, గ్రామంలోని నాలుగు వీథుల కూడలిలో ప్రతిష్ఠింపచేశాడు.

తర్వాత మిగిలిన డబ్బుతో, ధర్మరాజు గారి ధర్మబుద్ధీ, ఆయన చేసిన దానాల గురించి హరికథలూ, పాటలూ రాయించి,




**3**

మరునాడు వచ్చిన ధీరసింహుడితో, ''దక్షిణదిక్కు నుంచి, ప్రతి అమావాస్య అర్ధరాత్రివేళ, 'అయ్యో, ఉపయోగకరమైన పని ఏదీ చేయకుండానే, ఈ అమావాస్య కూడా గడిచిపోయిందే!' అన్న దీనస్వరం వినిపిస్తున్నది. ఆ కంఠస్వరం ఎవరిది? ఎందుకలా వినిపిస్తున్నది? ఇదే నా మూడవ ప్రశ్న.'' అన్నది సులోచన.

ఆమెవద్ద మూడు నెలలు గడువు తీసుకుని, ధీరసింహుడు దక్షిణదిక్కుగా బయలుదేరాడు. మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ పయనించేసరికి, అతనికొక భయంకరమైన అరణ్యం ఎదురయింది. ధీరసింహుడు, గుర్రాన్ని అక్కడే వదిలి, మూడు రోజులు కాలినడకనే అరణ్యాన్ని దాటాడు. అరణ్యానికి ఆమడ దూరంలో ఒక అందమైన నగరం కనిపించింది. ధీరసింహుడు ఉత్సాహంగా నగరం కేసి నడిచాడు. అతడు నగరంలో ప్రవేశించబోతూండగా, విచిత్ర వేషధారణలో వున్న ఇరువురు నగర ద్వారపాలకులు, అతణ్ణి అడ్డగించి బంధించబోయారు.

''నేనే నేరమూ చేయలేదే! నిష్కారణంగా నన్నెందుకు బంధిస్తున్నారు?'' అన్నాడు ధీరసింహుడు.

అయినా, వాళ్ళు అవేవీ పట్టించుకోకుండా అతన్ని బంధించి తిన్నగా రాజు సమక్షానికి తీసుకుపోయారు.



''నువ్వెవరు? ఏ దేశానికి చెందిన వాడవు? మా నగరానికి ఎందుకు వచ్చావు?'' అని అడిగాడు రాజు.

"నేను నేపాళ రాజకుమారుణ్ణి; నా పేరు ధీరసింహుడు. ఒక ముఖ్యమైన రాచ కార్యం మీద, మీ నగరం దాటి వెళ్ళ వలసి వచ్చింది. ఈ నగరంలో ప్రవే శిస్తూండగా నిర్దోషినైన నన్ను మీ భటులు బంధించి ఇక్కడికి తీసుకువచ్చారు,'' అన్నాడు ధీరసింహుడు.

రాజు దగ్గరే వున్న మంత్రి, ''ధీర సింహా, పరదేశస్థులెవరైనా ఈ నగరంలో ప్రవేశించినట్టయితే, మా రాజకుమారి సీమంతినీదేవి, వాళ్ళను మూడు ప్రశ్నలు అడుగుతుంది. వాటికి సరైన సమాధానాలు చెప్పేవారిని వదిలిపెడతాం. చెప్పలేని వారికి మరణదండన విధిస్తాం. ఇది మా శిరశ్ఛేదననగర ఆచారం!'' అన్నాడు.

''అపచారం! అమాయకులైన పర దేశస్థులను హతమార్చడం భరించరాని అన్యాయం. అన్యాయాలను అరికట్ట వలసిన పాలకులే ఇలా దురన్యాయానికి పాల్పడడం మరీ ఘోరం!'' అన్నాడు ధీరసింహుడు.

''నిజమే. ఆ విషయం మాకూ తెలును. అయినా, అలా జరగడాన్ని ఆపలేని నిస్స హాయస్థితి నాది. ఒక యక్షుడి శాపకార ణంగా నా గారాలపట్టికి ఈ దుస్థితి దాపురించింది. నేను నిందను అనుభవిస్తు న్నాను. ఆమెను చూద్దువుగాని, రా!'' అని, ధీరసింహుణ్ణి వెంటబెట్టుకుని, కుమార్తె వున్న భవనానికి బయలుదేరాడు రాజు.

వాళ్ళను చూడగానే, ''నా ప్రశ్నలకు సమాధానం చెప్పగల ధీరుడు వచ్చాడా!'' అంటూ గుడ్లురుమసాగింది సీమంతిని!

''అవును, ఆ ప్రశ్నలేమిటో అడుగు,'' అన్నాడు ధీరసింహుడు.

''ఫలాలన్నిటిలోకీ, ఉత్తమమైన, మధురమైన ఫలం ఏది?'' అని అడి గింది సీమంతిని.

''సంతానఫలం,'' అన్నాడు ధీర సింహుడు.

''ఎవరూ కోరనిది; అయితే అందరూ అనుభవించక తప్పనిది! ఏమిటది?'' అని అడిగింది సీమంతిని.

ధీరసింహుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''మరణం,'' అన్నాడు.

''ఆహా! నా మూడో ప్రశ్న కూడా విను: అది ఉన్నట్టయితే, ఏదీ లేక పోయినా అన్నీ ఉన్నట్టే. అది లేనట్టయితే అన్నీ వున్నా ఏదీ లేనట్టే. ఏమిటది?'' అన్నది సీమంతిని.

''బుద్ధిబలం,'' అన్నాడు ధీరసింహుడు.

మరుక్షణమే సీమంతిని పకపకా నవ్వి, స్పృహతప్పి కింద పడిపోయింది. అప్పుడు ఆమె శరీరం నుంచి నల్లత్రాచుపాము వంటి రూపం బయటికి వచ్చింది. ధీర సింహుడు దానిని ఒడుపుగాపట్టి, ఒక బిందెలో వేసి మూతపెట్టి, భూస్థాపితం చేయించాడు.

ఆ తరవాత సీమంతిని మెల్లగా కళ్ళు తెరచి, ''ఏమిటిదంతా?'' అంటూ చుట్టు పక్కల కలయచూసి, లేచి తిన్నగా వెళ్ళి తండ్రి చాటుగా నిలబడింది.

రాజు ఆనందబాష్పాలతో, ధీరసింహుడి చేతులు పట్టుకుని, ''నా బిడ్డకు శాప విముక్తి కలిగించి నన్ను నిందనుంచి



కాపాడావు. నీ రుణం ఈ జన్మలో తీర్చుకో లేను,'' అన్నాడు.

''అంతా దైవేచ్ఛ! నేనొక ముఖ్య విషయం తెలుసుకోవడానికి వెళు తున్నాను,'' అని తను వెళుతూన్న పని గురించి, తెలియజెప్పాడు ధీరసింహుడు.

''ఆ కంఠస్వరం మాకు కూడా వినిపిస్తు న్నది. అయితే, అది ఎక్కడి నుంచి వస్తున్నసంగతీ తెలియడం లేదు. సాటిలేని ధీశాలివయిన నువ్వు సాధించరాని వంటూ వుండవు,'' అని ఆశీర్వదించి, అతణ్ణి సాగనంపాడు రాజు.

ధీరసింహుడు అక్కడి నుంచి దక్షిణ దిక్కుగా పయనం సాగించాడు. మూడు



రోజులు నడిచాక, అతడొక ఎడారి ప్రాంతం చేరుకున్నాడు. అర్ధరాత్రి సమయం; అమావాస్య చీకటి. ఆకాశంలో నక్షత్రాలు తప్ప మరేదీ కనిపించడం లేదు. హఠాత్తుగా భయంకరమైన ఇసుకతుపాను రేగింది. ధీరసింహుడు ఆ తుపాను వేగానికి కొట్టుకు పోయి, దక్షిణ దిక్కున వున్న ఒక చెట్టు కింద పడ్డాడు. అతడు లేచి కూర్చుని చుట్టుపక్కల కలయజూశాడు. అంతలో లీలగా గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. అతడు లేచి, ఆ చప్పుడు విని పిస్తూన్న దిక్కుకేసి నడిచాడు. దాపులనే ఒక చిన్న కొండ కనిపించింది. ఉత్సాహంగా కొండ మీదికి వెళ్ళాడు ధీరసింహుడు. కొండ దిగువన విశాలమైన పచ్చికమైదానం కనిపించింది. ఇంతలో టంగుటంగుమని పన్నెండు గంటలు కొట్టేసరికి, వింత వెలుతురులో సైనికుల దుస్తులలో వున్న కొందరు ఆ మైదానం కేసి తిన్నగా రాసాగారు. వాళ్ళందరూ విలువైన ఆభరణాలు ధరించి వున్నారు. వాళ్లనుంచి ఘుమఘుమలాడే పరిమళాలు వీస్తున్నవి. వాళ్ళందరూ రత్నాలు పొదిగిన తివాసీ మీద, బారులు తీర్చి కూర్చున్నారు.

వాళ్ళకు కొద్దిదూరంలో, ఒక వృద్ధుడు చింకిబట్టలతో, చిక్కిశల్యమైన శరీరంతో, చింపిరి తలతో బికారి లాగా నేల మీద కూర్చుని దిక్కులుచూస్తూ, "అయ్యో, ఉపయోగకరమైన పని ఏదీ చేయకుండానే ఈ అమావాస్య కూడా గడిచి పోయిందే," అని కేక పెట్టాడు!

కొంతసేపటికి, అక్కడ కూర్చున్న వాళ్ళందరి ముందూ ఒక్కొక్క బంగారు పళ్ళెమూ, పళ్ళాల నిండా పంచభక్ష్య పరమాన్నాలూ వచ్చాయి. వాళ్ళలో ఒకడు, అదనంగా వున్న ఒక పళ్ళాన్ని ధీరసింహుడికి చూపి, "ఎందుకలా దూరంగా నిలబడి చూస్తున్నావు? రా, మాతో కలిసి భోజనం చేద్దువుగాని," అన్నాడు.

ధీరసింహుడు వెళ్ళి పళ్ళెంముందు కూర్చున్నాడు.

ముసలివాడి ముందు తప్ప, అందరి ఎదుటా పళ్ళాలనిండా ఆహారపదార్థాలున్నాయి. ముసలివాడి ముందు ఒక ఓటిపెంకూ, దానినిండా రాళ్ళూ, రప్పలూ ఉన్నాయి. అందరూ హాయిగా విందు భోజనం చేస్తూవుంటే, ముసలివాడు, దీనంగా వాళ్ళకేసి చూస్తూ కూర్చున్నాడు.

దానిని గమనించిన ధీరసింహుడు, "ఆ ముసలివాడు ఏం నేరం చేశాడు? అతనికి మాత్రం భోజనం లేకుండా చేశారెందుకు?" అని అడిగాడు.

"ఆ సంగతి అతన్నే అడుగు!" అన్నారు అందరూ ఏకకంఠంగా.

ధీరసింహుడు తన పళ్ళెంలో ఆహారాన్ని రెండు భాగాలు చేసి, ఒక భాగాన్ని ముసలివాడికి అందించి తినమన్నాడు. కాని, అది మరుక్షణమే రాళ్ళూ, రప్పలుగా మారిపోయింది.

"ఏమిటీవింత?" అని అడిగాడు ధీరసింహుడు.

"అంతా స్వయంకృతాపరాధం, నాయనా," అన్నాడు ముసలివాడు దీనంగా.

"ఎందుకిలా జరుగుతున్నది? ఏం పాపం చేశావు నువ్వు?" అని అడిగాడు ధీరసింహుడు.

"అదొక పెద్ద గాథ! ఇక్కడికి పదమరగా పదియోజనాల దూరంలో వున్న





విదిశానగరంలో కోట్లకు పడగలెత్తిన ధనగుప్తుడనే వ్యాపారిని నేను. ఎంతో ధనం ఆర్జించాను తప్ప, పిల్లికయినా బిచ్చం వేసిన పాపాన పోలేదు. పైగా దానధర్మాలు చేసేవారిని చూసి పరిహసించే వాణ్ణి. వీలయితే అవి జరగకుండా అడ్డుపడే పాపాత్ముణ్ణి. దానికితోడు నావద్ద పనిచేసే నౌకర్లకు సక్రమంగా జీతాలు ఇచ్చేవాణ్ణికాదు. వాళ్ళను విపరీతంగా హింసించేవాణ్ణి. పాతికేళ్ళ క్రితం, ఒక నాడు దూరదేశంలో వ్యాపారం చేయడానికి, పట్టు వస్త్రాలనూ, మణులూ మాణిక్యాలనూ ఒంటెలమీది కెక్కించుకుని, అనేకమంది నౌకర్లను వెంటబెట్టుకుని బయలుదేరాను. ఎడారిలో బందిపోటు దొంగలు మామీద పడి దోచుకోవడంతోవదిలిపెట్టకుండా, మమ్మల్నందరినీ హతమార్చి ఇక్కడ పాతిపెట్టారు. నా ఎదుట కూర్చుని హాయిగా విందు భోజనం చేస్తున్నవాళ్ళందరూ, ఆనాటి నాకింది నౌకరులే. వాళ్ళందరూ కొద్ది ఆదాయంతోనే, దానధర్మాలు చేస్తూ ధర్మబద్ధమైన జీవనం సాగించారు. దాని ఫలితంగా వాళ్ళిప్పుడు స్వర్గసుఖాలనుభవిస్తున్నారు. ధర్మ విరుద్ధమైన, నిరుపయోగమైన జీవితం గడిపిన నేను, చనిపోయాక ఇప్పుడు నా నౌకర్ల ఎదటే నరకబాధలు అనుభవిస్తున్నాను,'' అన్నాడు ధనగుప్తుడు కన్నీళ్ళు తుడుచుకుంటూ.

''ఈ దుస్థితి నుంచి బయటపడే మార్గమేదైనా వుంటే చెప్పు. నా చేతనైన సహాయం చేస్తాను,'' అన్నాడు ధీరసింహుడు.

''నేను ఆర్జించిన ధనంలో చాలా భాగం, మా ఇంటి పెరడులో, ద్వారానికి పది గజాల దూరంలో తూర్పు దిక్కున గొయ్యి తీసి పాతిపెట్టాను. ఆ సంగతి తెలియని కారణంగా నా ముగ్గురు కుమారులూ దారిద్ర్య బాధతో పడరానిపాట్లు పడుతున్నారు. నేను పాతిపెట్టిన ధనాన్ని తీసి, నాలుగు భాగాలు చేసి, అందులో మూడు భాగాలు ప్రజోపయోగ కార్యాలకు

వినియోగించి, ఒక భాగాన్ని నా కుమారులు పంచుకున్నట్టయితే, నాకు ఉత్తమ గతులు కలుగుతాయి. నేను ఈ నరక కూపంనుంచి బయటపడతాను,'' అని చెప్పాడు ధనగుప్తుడు.

ధీరసింహుడు అక్కడి నుంచి బయలుదేరి, విదిశానగరం చేరుకుని, ధనగుప్తుడి కుమారులను కలుసుకుని, వాళ్ళ తండ్రి కథంతా చెప్పాడు. మొదట వాళ్ళు ధీరసింహుడి మాటలను నమ్మలేదు. కాని, అతడు ఆనవాలు చెప్పిన ప్రకారం, పెరటిలో త్రవ్వి చూడగా, ధనరాసులు బయటపడడంతో, వాళ్ళు పరమానందం చెంది, తండ్రి కోరిక ప్రకారం దానిని నాలుగు భాగాలు చేసి, మూడు భాగాలు దానధర్మాలకు వినియోగించి, మిగిలిన ఒక్క భాగాన్ని ముగ్గురూ సమంగా పంచుకున్నారు. దాంతో వారికి సంపన్న జీవితం ప్రారంభమయింది.

ధీరసింహుడు, మరుసటి అమావాస్య నాడు ఎడారి దాపులనున్న కొండ దగ్గరికి చేరాడు. నాటిరాత్రి సమావేశమైన వాళ్ళందరితోపాటు, ధనగుప్తుడు కూడా, చక్కటి దుస్తులూ, విలువైన ఆభరణాలూ ధరించి, అందరిమధ్యా కూర్చుని నవ్వుతూ, కబుర్లు చెప్పుకుంటూ, విందుభోజనం చేయడం చూసి ఎంతో సంతోషించాడు, ధీరసింహుడు.

ధనగుప్తుడు లేచివచ్చి, ధీరసింహుడికి ఆనందబాష్పాలతో కృతజ్ఞతలు తెలియజేశాడు.

ధీరసింహుడు అప్పటికప్పుడే బయలుదేరి, కౌశాంబీ నగరం చేరుకుని, తాను చూసిన ధనగుప్తుడి ఉదంతాన్ని సులోచనకు వివరించాడు. ఆ విషయాలన్నిటినీ ఆసక్తితో విన్న సులోచన, ''నువ్వు చెప్పినదంతా నిజం. ఈ అమావాస్య రాత్రి ఆ దీన స్వరం వినిపించలేదు. నీ ధైర్య సాహసాలూ, పరోపకారబుద్ధీ ప్రశంసనీయం. రేపు వచ్చావంటే నాలుగవ ప్రశ్న చెబుతాను,'' అని అతణ్ణి సాదరంగా సాగనంపింది. —(ఇంకావుంది)






# స్వప్రయోజనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ''నిన్ను చూస్తూంటే, నాకొక సందేహం కలుగుతున్నది. నువ్వీ అపరాత్రి వేళ పడుతున్న శ్రమా, వినియోగిస్తున్నశక్తి యుక్తులూ, స్వప్రయోజనం కోసమా లేక పరుల మేలుకా? సామాన్యంగా ఈ లోకంలో ఎవరైనా తమ శక్తినీ, ప్రతిభనూ తమ సొంత లాభం కొరకే ఉపయోగించుకుంటారు. నీలాగా పరుల మేలుకు ఉపయోగించాలనుకోరు. వెనకటికి సుదర్శను డనే వాడు తనకున్న శక్తి యుక్తుల్ని, మేలు చేసినవాడిని కాదని, తన స్వప్రయోజనం కోసం మాత్రమే ఉపయోగించుకున్నాడు. నీకు శ్రమ

## బేతాళ కథలు



తెలియకుండా వుండేందుకు అతడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం కన్యాకుబ్జంలో, రత్నగుప్తుడనే ఒక వర్తకశ్రేష్ఠుడుండేవాడు. అతడు అనేక లాభసాటి వ్యాపారాలు చేసి కోట్లకు పడగలెత్తాడు. వయసు మీరి వృద్ధాప్యం మీదపడ్డా, ఆయన విశ్రాంతి తీసుకోకుండా మరింత సంపద సంపాదించాలన్న ధ్యాసతో కొత్తగా సముద్ర వ్యాపారం ప్రారంభించాడు.

ఆయన తూర్పుదీవులకు సుగంధ ద్రవ్యాలను వ్యాపారం నిమిత్తం తీసుకుపోయి, వాటిని లాభసాటి ధరలకు అమ్మి అంతులేని ధనాన్ని సంపాయించాడు. రత్నగుప్తుడిది ధనసంపాదనలో విరామమెరుగని మనస్తత్వం. కొత్తగా ప్రారంభించిన సముద్రవ్యాపారం అచ్చిరావడంతో, ఆయన మరింత ఉత్సాహంతో దాన్ని వృద్ధి చేయసాగాడు.

ఒకసారి ఆయన సుగంధ ద్రవ్యాలను, ఓడలకు ఎత్తించుకుని, సముద్రప్రయాణం సాగించి, తూర్పుదీవులలోని ఒక రాజధానీ నగరం చేరి, అక్కడ వున్న ఒక సత్రంలో బసచేశాడు.

ఆ మరుసటిరోజు, ఆయన అమ్మకాలు ప్రారంభించి, తెచ్చిన సరుకులో చాలా భాగం అమ్మేశాడు. ఆ రాత్రి ఆయన భోజనం అయాక అమ్మకం వివరాలుగల పత్రాలను ముందు పెట్టుకుని సత్రం అరుగు మీద కూర్చున్నాడు. అర్ధరాత్రి కావస్తున్నా లెక్కలు సరిగా తెమలలేదు. అర్ధరాత్రి దాటిపోయిందన్న ధ్యాస ఆయనకు లేదు.

ఇదంతా సత్రం అరుగు మరొకవైపున పడుకొని, నిద్రపట్టక ఆలోచనలతో వున్న యువకుడొకడు చూశాడు. అంత పెద్దవాడు, అంత రాత్రివేళ పత్రాలతో సతమతమవుతూండడం, ఆ యువకుడికి ఆశ్చర్యంతోపాటు ఎంతో ఆసక్తి కలిగించింది.

యువకుడు లేచి, రత్నగుప్తుడి వద్దకు వచ్చి, "అయ్యా, నా పేరు సుదర్శనుడు. ఈ వయసులో అర్ధరాత్రివేళ రాతకోతలతో అంత శ్రమపడుతున్నారేమిటి?" అని అడిగాడు.

రత్నగుప్తుడు తల ఎత్తి, సుదర్శనుణ్ణి చూసి, "నాయనా, నేనొక వర్తకుణ్ణి. ఈ రోజంతా నగరంలో సరుకు అమ్మకాలు చేశాను. వాటి లెక్కలు తేలక కాస్త యిబ్బంది పడుతున్నాను, అంతే!" అన్నాడు.

"మీకేమీ అభ్యంతరం లేకపోతే, ఆ పత్రాలివివ్వండి. మీ లెక్క సరిచేసేందుకు ప్రయత్నిస్తాను," అన్నాడు సుదర్శనుడు.

"ఇవి వ్యాపారానికి సంబంధించిన లెక్కలు. చాలా కష్టమైనవి, నువ్వు అనుకున్నంత తేలిగ్గా తేలేవి కావు." అన్నాడు రత్నగుప్తుడు.

"అయ్యా, నాకు యిష్టమైన శాస్త్రం గణితం. నేను చిన్నప్పటి నుంచీ దాన్ని ఎంతో పట్టుదలతో అభ్యసించాను. మీ వ్యాపారం లెక్కలు నాకొక లెక్కలోనివి కావు." అంటూ సుదర్శనుడు పత్రాలను తీసుకుని, క్షణంలో వాటిని గుణించిపెట్టి, రత్నగుప్తుణ్ణి అమితాశ్చర్యంలో ముంచెత్తాడు.

సుదర్శనుడికి కృతజ్ఞతలు తెలుపుతూ రత్నగుప్తుడు, అతణ్ణి గురించిన వివరాలడిగాడు.





"నా పేరు మీకు యిదివరకే చెప్పాను. కొన్నేళ్ళక్రితం నా తండ్రితోపాటు వ్యాపార నిమిత్తం, కన్యాకుబ్జం నుంచి తూర్పు దీవులకు వచ్చి, యిక్కడే స్థిరపడ్డాను. నా తండ్రి వ్యాపారంలో బాగా నష్టపోయి, సొంతదేశం వెళ్ళడానికి మనసొప్పక, దిగులుతో మంచంపట్టి మరణించాడు. ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే, నా తల్లీ కాలం చేసింది. రాచకొలువులో ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమో అని, రాజధానీ నగరానికి వచ్చాను," అన్నాడు సుదర్శనుడు.

రత్నగుప్తుడు కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, "బతుకుతెరువుకు ఏదో ఉద్యోగమే చేయనవసరం లేదు. నీకు నిజంగానే వ్యాపారంపట్ల ఆసక్తి గనక వుంటే, నాతోపాటు మన దేశం రా. నాకు వ్యాపారంలో సాయం చేస్తూ వుందువు గాని," అన్నాడు.

సుదర్శనుడు సంతోషంగా తన అంగీకారం తెలిపాడు. మిగతా సరుకుల అమ్మకం తర్వాత రత్నగుప్తుడు, సుదర్శనుడు బయలుదేరి స్వదేశం చేరారు. వినయవిధేయతలూ, సునిశితమైన మేధాశక్తీ గలిగిన సుదర్శనుడు, అతితక్కువ కాలంలోనే రత్నగుప్తుడి ఆదరానికి పాత్రుడయ్యాడు.

కొంతకాలం గడిచింది. రత్నగుప్తుడు మరొకసారి తూర్పుదీవులకు వ్యాపార నిమిత్తం వెళ్ళాలని ప్రయాణ సన్నాహాలు చేశాడు. కాని, తీరా బయలుదేరనున్న సమయంలో ఆయన తీవ్రమైన అస్వస్థతకు గురయ్యాడు.

ఆ స్థితిలో ఆయన సుదర్శనుడితో, "నువ్వొక్కడివే బయలుదేరి వెళ్ళు. మన వద్ద పదిలక్షలు విలువచేసే సరుకున్నది. వాటి విలువ అక్కడ పదిహేను లక్షల వరకూ వుండవచ్చు. ప్రయాణంఖర్చులూ అవీ పోను మనకు నాలుగులక్షల ఆదాయం రావచ్చు. నువ్వు తక్షణం బయలుదేరు," అన్నాడు.

ఆ విధంగానే సుదర్శనుడు ఓడలతో బయలుదేరి, తూర్పుదీవులు చేరి, లోగడ రత్నగుప్తుడు వున్న సత్రంలోనే బస చేశాడు. అక్కడ అతడికి మరికొందరు వర్తకులు పరిచయమయ్యారు.

వాళ్ళు మాటల సందర్భంలో, సుదర్శనుడితో, "సుగంధ ద్రవ్యాలకు యిక్కడ ఇప్పుడు బాగానే గిరాకీ వున్నది. కానీ మరొక నెల రోజుల్లో వాటి ధర మరింత పెరిగే అవకాశం కనబడుతున్నది. అంత దాకా ఆగితే రెట్టింపు లాభాలు రావచ్చు. అయినా, ఇది కొంత ధైర్యంతో కూడిన పనే! భారాన్ని దేవుడి కొదిలి, మేం ఆగదలిచాం. మరి మీ మాటేమిటి?" అన్నారు.

సుదర్శనుడు కొద్దిసేపు ఆలోచించి, "ఎంత త్వరగా వీలయితే, అంత త్వరగా సరుకు అమ్మి స్వదేశం చేరాలనుకుంటున్నాను," అన్నాడు.

ఆ విధంగానే అతడు, సరుకంతా త్వరగా అమ్మేసి, అప్పటికప్పుడే బయలుదేరి స్వదేశం చేరాడు. అతడు చెప్పిన అనుభవాలు విని, రత్నగుప్తుడు వచ్చిన లాభాలలో నాలుగోవంతు అతడి కిచ్చేశాడు.

కొన్నాళ్ళు గడిచాక, సుదర్శనుడు మరొకసారి వ్యాపారనిమిత్తం తూర్పు దీవులకు వెళ్ళాలనుకున్నాడు. సంగతి విని, రత్నగుప్తుడు ఎంతగానో సంతోషించి, "వ్యాపారికి వున్నదానితో సంతృప్తి





చెందడం గాని, విశ్రాంతి కోరడం గాని ఏమాత్రం తగనిపనులు, అలాగే నీ ఇష్టానుసారం వెళ్ళిరా. ఈసారి నీకు వచ్చే లాభాలలో సగం యిస్తాను,'' అన్నాడు.

సుదర్శనుడు ఓడలకు సరుకులు ఎక్కించి, తూర్పుదీవులు చేరి, లోగడ బసచేసిన సత్రానికి వెళ్ళాడు. అక్కడ సాటివర్తకులతో అతడి మాటలు కలిశాయి. సుదర్శనుడు వాళ్ళతో, సరుకులకు అధికధరలు వచ్చే అవకాశం వున్నది కనుక, కొన్నాళ్ళపాటు వేచి చూస్తానన్నాడు.

సుదర్శనుడు ఊహించినట్టే సరుకులకు అధికధరలు పలికాయి. అతడు రెట్టింపు లాభాలు గడించాడు. వెంటనే తిరుగుప్రయాణం కట్టక, అక్కడ లభించే దంతపుబొమ్మలు కొని, వాటితో కన్యాకుబ్జానికి తిరిగి వచ్చాడు.

గృహాలంకరణపట్ల ఎక్కువ ఆసక్తి చూపే సంపన్నులకు వాటిని అధిక ధరలకు అమ్మి, మరింతగా లాభం సంపాయించాడు.

సుదర్శనుడి వ్యాపారదక్షతకు, ఎంతో ముచ్చటపడిన రత్నగుప్తుడు, ఒకనాడు అతడితో, ''నీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలని కొద్దిరోజులుగా ఆలోచిస్తున్నాను. నాకున్నది ఒక్కగానొక్క కూతురన్న విషయం నీకు తెలుసు. నువ్వు నాకు ఎంతో నచ్చావు. నువు, నా అల్లుడు కావాలన్నదే, నా కోరిక. నీకు సమ్మతమేనా ?'' అని అడిగాడు.

సుదర్శనుడందుకు సంతోషంగా అంగీకరించాడు. రత్నగుప్తుడు, తన కూతురి వివాహం సుదర్శనుడితో ఎంతో ఘనంగా జరిపించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సుదర్శనుడు స్వప్రయోజనాపరుడిలా కనబడుతున్నాడు. రత్నగుప్తుడి వద్ద ఉద్యోగిగా వున్న రోజుల్లో, సాటివర్తకులు సరుకుధర పెరిగే అవకాశం వున్నదని చెప్పి, కొంతకాలం ఆగమన్నారు. కాని,

అతడలా చేయక వచ్చిన లాభానికి సరుకు అమ్మేశాడు. కాని, రత్నగుప్తుడితో భాగస్వామి అయాక, మరింత లాభం కొరకు చాలా రోజులు, ఆ దీవుల్లోనే వుండిపోయాడు. అంతేకాక, అక్కడ లభించే దంతపు వస్తువులు కొని, తన దేశంలో అమ్మి, మంచి లాభాలు గడించాడు. మొదటిసారి తన శక్తియుక్తులు ఉపయోగిస్తే, ఎక్కడ యజమానికి అధిక లాభాలు వస్తాయో అని జాగ్రత్తపడ్డాడు. తానే యజమానినని తెలిశాక, రెండవసారి తన ప్రతిభనుపయోగించి, వ్యాపారాన్ని మరింతగా వృద్ధిపరుచుకున్నాడు. ఇలాంటి స్వప్రయోజనాపరుణ్ణి రత్నగుప్తుడు గుర్తించకపోవడం అటుంచి, అతడి వ్యాపార దక్షతను మెచ్చుకోవడం ఏమిటి? రత్నగుప్తుడు, సుదర్శనుడి నిజరూపాన్ని గుర్తించలేనంతటి అమాయకుడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సుదర్శనుడు స్వప్రయోజనాపరుడనడానికి ఆధారం ఏదీ లేదు. మొదటిసారి తూర్పుదీవులకు వెళ్ళినప్పుడు, అతడు కేవలం ఒక ఉద్యోగి మాత్రమే. యజమాని చెప్పినట్లు చేసుకు రావడమే అతని పనిగాని, స్వంత నిర్ణయాలు తీసుకోవడం, కాదు. రెండవసారి యజమాని తానే గనక, కష్టమైనా, నష్టమైనా ఎదుర్కొనడానికి సిద్ధపడ్డాడు. తాను మరొకరికి జవాబు చెప్పవలసిన అవసరం లేదు. తిరుగు ప్రయాణంలో, అతడు మరొక వ్యాపారం గురించి ఆలోచించడం ఎందుకంటే, స్వంతప్రతిభగలవాడుగా గుర్తింపు పొందేందుకు. సుదర్శనుడు ఉద్యోగిగా తన బాధ్యతలనూ, యజమానిగా తన వ్యాపారదక్షతనూ నిర్వర్తించడంలో, తన సునిశిత మేధాశక్తిని ఉపయోగించుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# పటాటోపం

ఒక రైతుకు, ఈడొచ్చిన కొడుకొకడున్నాడు. వాడికి ఆడంబరం జాస్తి. ఖరీదైన దుస్తులు వేసుకుని, విలువైన మనిషిగా కనిపించాలని వాడి తాపత్రయం. తండ్రికి కొడుకు పద్ధతి నచ్చలేదు. వాడికి బుద్ధి చెప్పాలని, సరియైన అదునుకోసం చూడసాగాడు.

ఒకనాడు రైతు, తన గొడ్డుటావును బాగా అలంకరించి, దాన్ని సంతకు తోలుకుపోయి అమ్ముకుని రమ్మని; కొడుకును పురమాయించాడు.

సంతలో ఆవును చూసిన ప్రతివాడూ, "రోజుకు ఎన్నిశేర్ల పాలిస్తుంది?" అని అడిగేవాడే కాని, అలంకరణచూసి దాన్ని కొన్నవాడు లేడు.

సంత అయిపోయింది. ఎంత తక్కువ ధరకు అమ్ముదామన్నా, రైతుకొడుకు ఆవును అమ్మలేక, సాయంకాలానికి ఉసూరుమంటూ ఇల్లు చేరాడు.

"పాలివ్వని ఆవును, మెడగంటలు చూసి ఎవ్వరూ కొనరు. పటాటోపంవల్ల పెద్ద ప్రయోజనం ఏమీ వుండదు!" అన్నాడు రైతు, తన కొడుకుతో.

అనాటినుంచి రైతుకొడుకు, కృషిచేసి మంచి లక్షణాలు అలవర్చుకుని నిరాడంబరంగా జీవించాడు.

—డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్



# చందమామ అనుబంధం—4
# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:




### చైతన్యప్రభువు

శ్రీచైతన్యప్రభువుగా ప్రసిద్ధిగాంచిన గౌరాంగుడు బెంగాల్‌లోని నవద్వీపంలో 1486 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో జన్మించాడు. గొప్ప పండితుడుగా పేరుగాంచిన చైతన్యప్రభువు, ఇరవైనాలుగవయేట సన్యాసం స్వీకరించి, ఇల్లు వదిలిపెట్టాడు. సామాన్య జనానీకానికి శ్రీకృష్ణ ప్రేమను ప్రబోధిస్తూ, ఆయన బృందావన మొదిగా గల పుణ్యక్షేత్రాలెన్నిటినో సేవించాడు. పవిత్ర పూరీ జగన్నాథ మందిరంలో చాలా కాలం గడిపాడు. మనిషికి భగవద్భక్తి ప్రధానమేగాని, కులమత భేదాలు పనికిరాదన్నాడు. ఆయన్ను భక్తితో దర్శించినవారందరూ ఆనందంపొందారు. అహంకారంతో విర్రవీగిన వారెందరో ఆయన్ను దర్శించి, వినయ సంపన్నులయ్యారు. ఎందరో నాస్తికులు భక్తులయ్యారు. ఒరిస్సాకు చెందిన ప్రతాపరుద్రదేవరాజు, శ్రీ చైతన్యప్రభువుపట్ల ఎంతో గౌరవాదరాలు చూపాడు.

వైష్ణవమతానికి నవచైతన్యాన్ని కలిగించిన, చైతన్యప్రభువు, తన 48 వ యేట, హఠాత్తుగా ఎవరికీ కనిపించకుండా పోయాడు!

## ఎవరాయన?

అదొక వేసవికాలం. మెల్లగా సాగుతూన్న చల్లటి నదీప్రవాహంలో కొందరు కుర్రవాళ్లు ఉత్సాహంగా ఈతకొడుతూ స్నానం చేస్తున్నారు. హఠాత్తుగా వాళ్ళ మధ్య ఒక మొసలి తోక కనిపించింది. మరుక్షణమే వాళ్ళలో ఒక కుర్రవాడు, "మొసలి నా కాళ్ళు పట్టుకున్నది!" అని అరిచాడు.

నది గట్టుమీద ఉన్న ఇద్దరు కుర్రాళ్ళు, పరిగెత్తిపోయి, కుర్రవాడి తల్లికి విషయం చెప్పారు. భయభ్రాంతురాలయిన ఆ కుర్రవాడి తల్లి, హడలిపోయి పరుగుపరుగున నది దగ్గరికి చేరుకున్నది.

"అమ్మా, మరణంనుంచి నన్ను కాపాడడానికి ఒకటే మార్గం ఉన్నది; నన్ను దేవుడికి సమర్పించాలి! ఆ పని చేయగలవా?" అన్నాడు కుర్రవాడు.

"ఈ క్షణమే నిన్ను దేవుడికి సమర్పిస్తున్నాను. ఆ భగవంతుడే నిన్ను రక్షించాలి," అన్నది తల్లి కన్నీళ్ళతో.

మరుక్షణమే, మొసలి ఆ కుర్రవాణ్ణి వదిలి, దూరంగా వెళ్ళిపోయింది!

ఆ కుర్రవాడెవరో మీకు తెలుసా?

(VIII పేజీ చూడండి)

సూచనలు :

గట్టిగా బిగించడానికి వీలుగా మూతగల, ఒక చిన్న డబ్బాను తీసుకుని, దానికి అడుగు భాగం లోనూ, మూత మధ్యలోనూ రెండేసి రంధ్రాలు చేయండి. తరవాత, దృఢమైన రబ్బరు బ్యాండ్ ఒకటి తీసుకుని, మధ్యగా కత్తిరించి, దానిని పొడవుగా ఒకే ముక్కలా తయారుచేయండి. ఆ రబ్బరు దారాన్ని డబ్బా రంధ్రాల గుండా పోనిచ్చి, రెండు కొనలనూ ముడివేయడానికి ముందు, దానికి కాస్త బరువైన లోహపునట్టును గాని, గాలంముల్లునుగాని గుచ్చండి. అది, డబ్బా లోపల ఒక దారానికి వేలాడుతూ వుంటుందన్న మాట. (చిత్రంలో చూడండి) డబ్బా దొర్లేప్పుడు, బరువు దిగలాగకూడదన్న మాట. ఇప్పుడు పై మూతను గట్టిగా బిగించి, డబ్బాను నేలమీద నెమ్మదిగా దొర్లించి, ఏం జరుగుతుందో చూడండి:





## విచిత్ర చలనం

ఏం జరుగుతుంది ? ఎలా జరుగుతుంది ?

డబ్బా కొంతదూరం దొర్లుకుంటూపోయి, ఆగి, మళ్ళీ వెనక్కు దొర్లుకుంటూ వస్తుంది. ఇలా ఎందుకు జరుగుతుంది ? డబ్బా ముందుకు దొర్లేప్పుడు లోపల ఒక దారానికి వేలాడుతూన్న బరువు, రెండవ దారానికి చుట్టుకుపోతుంది. డబ్బా ఆగిన తరవాత, బరువు అధోముఖ శక్తిని పుట్టించి, పెనవేసుకున్న దారాల్ని విడదీస్తుంది. అప్పుడు డబ్బా వెనక్కు దొర్లుతుంది.

అసలు విషయం తెలియనివారికి ఈ డబ్బా విచిత్ర చలనం ఆశ్చర్యం కలిగిస్తుంది. దీనిని మీ స్నేహితులకు చేసి చూపరాదా ?

డబ్బాను చేతిలోకి తీసుకుని, లోపలి రబ్బరుదారాలు పెనవేసుకునేలా పైకి కిందికి తిప్పి, నేలమీద దొర్లించినట్టయితే దూరంగా పోతుందా ? ప్రయత్నించి చూడండి.

ఇంకా తేలికగా వున్న రౌండ్ పేపర్, ఓట్సుపిండి డబ్బా వంటివి వేగంగా దొర్లుతాయా ? అవును. దొర్లాలి; ఎందుకంటే, దొర్లడానికి డబ్బా తేలికగా వుండాలి మరి!





# జియస్ విగ్రహం

క్రీ. పూ. 5 వ శతాబ్దంలో గ్రీసు దేశాన్ని పెరిక్లీజ్ అనే గొప్ప వీరుడు పరిపాలించాడు. ఆయన పరిపాలనా కాలం, ఏథెన్స్ నగర చరిత్రలో స్వర్ణయుగంగా పేరు గాంచింది.

గ్రీకు మహాశిల్పి ఫిడియస్, ఆ కాలంలోనే నివసించాడు. ఫిడియస్ మొదట, బంగారు—దంతం మిశ్రమంతో 40 అడుగుల ఎత్తయిన ఎథీనా దేవత విగ్రహాన్ని సృష్టించాడు. ఆ విగ్రహం, ఏథెన్స్ నగర మధ్యంలో కొండమీద వున్న సుప్రసిద్ధ పార్థినాన్ దేవాలయంలో ప్రతిష్ఠించబడింది.

ఒలింపియా మందిరంలో ప్రతిష్ఠించడానికి ఫిడియస్ రూపొందించిన మరొక బ్రహ్మాండమైన బంగారు—దంతం విగ్రహం జియస్! మనిషి ఎత్తుకు ఏడింతలు పెద్దదైన ఈ బ్రహ్మాండమైన విగ్రహాన్ని—ఏడు ప్రపంచపు వింతలలో ఒకటిగా ప్రాచీనులు భావించే వారు!



గొప్ప చారిత్రక ఘట్టాలు

# కార్తేజ్ పతనం

క్రీ. పూ. 3వ శతాబ్దంలో సిరియా, సముద్రతీర ప్రాంతాలలో నివసించిన ఫొనీషియన్లు, కార్తేజ్ అనే బ్రహ్మాండమైన నగరం నిర్మించారు. కార్తేజ్ నగరం ఆనాడు, వర్తక వ్యాపారాలకు గొప్ప కేంద్రంగా ప్రసిద్ధి గాంచింది.

ఇంచుమించు కార్తేజ్‌కి అభిముఖంగా, సుదూరంలో రోమ్ నగరం వెలిసింది. రెండు నగరాలకూ మధ్య వైరం ప్రబలి దారుణమైన యుద్ధాలకు దారితీసింది. ఆ యుద్ధాలను చరిత్రకారులు పూనిక్ సంగ్రామాలుగా పేర్కొంటారు.

మొదటి పూనిక్ సంగ్రామంలో కార్తేజ్ అపజయం పాలయింది. కొన్నాళ్ళకు శాస్త్ర కోలుకున్నాక, కార్తేజ్, హానిబాల్ అనే సేనానాయకుడి నాయకత్వంలో రోము నగరం మీదికి తన సేనలను పంపింది. అతను రోమనులను ఓడించి తొంభైవేలమందిని హతమార్చాడు. కొంత కాలం నియంతగా అక్కడే వుండి తన రాక్షసాధికారాన్ని చెలాయించాడు.

కొన్నాళ్ళకు కార్తీజియన్లు అతనికి, ధనం, ఆహార పదార్థాల సరఫరా ఆపివేశారు. ఇక అతడు అక్కడ వుండలేక స్వనగరానికి తిరిగి వెళ్ళాడు. గొప్ప నాయకుడిగా ప్రజలు తనకు స్వాగతం చెబుతారని ఆశించాడు. కాని, కారణం ఏదయినప్పటికీ, అతణ్ణి ఎవరూ పట్టిం



చుకోలేదు. విరక్తి పుట్టి హానిబాల్ ఆత్మహత్య చేసుకున్నాడు!

క్రమక్రమంగా రోమ్ పునర్నిర్మాణం ప్రారంభమయింది. కొన్నాళ్ళకు సిపియో అనే యోధుడు సేనాధిపతి అయ్యాడు. అతడు కార్తేజ్ మీదికి సేనలను నడిపి, నగరాన్ని చుట్టుముట్టాడు. నగరానికీ, బయటి ప్రపంచానికీ సంబంధం లేకుండా చేశాడు. నగర ప్రజలకు రోజుల తరబడి ఆహారపదార్థాల సరఫరాలేకుండా చేసి, ఆపైన, సిపియో సేనలతో నగరంలో ప్రవేశించాడు. మొత్తం ఏడు లక్షల జనాభాలో ఆరున్నర లక్షలమందిని ఊచకోత కోయించాడు. మిగిలిన వారిని బానిసలుగా రోమ్ నగరానికి నడిపించాడు!

ఆ పిమ్మట, రోమనులు, కార్తేజ్ నగరాన్ని సమూలంగా నాశనం చేశారు. ఒక్క భవనంగాని, గోడగాని, తుదకు స్తంభంగాని లేకుండా పడగొట్టారు. ఆఖరికి శిథిలాలపై నాగళ్ళతో దున్ని పునాదులతో సహా పెళ్ళగించి, నిర్మూలించారు!

మానవ చరిత్రలో మనిషి పూనుకుని చేసిన మహాదారుణ వినాశకర కృత్యాలలో ఇది మొట్టమొదటిది. ఒక హింస మరొక హింసకు దారితీస్తుందన్న సత్యానికి కార్తేజ్ పతనం ఒక చారిత్రక తార్కాణం!



## గత చరిత్రలోకి చూద్దాం



1. కర్ణాటక' అనే మాటకు అర్థం ఏమిటి?
2. భారతదేశానికి వెలుపల ఏ దేశ రాజధానీనగరానికి అయోధ్య అనే పేరున్నది?
3. మనదేశంలో కోట చుట్టూ ఏర్పడిన నగరం ఏది?
   (ఎ) ఆ కోట పేరేమిటి?
   (బి) దాని నిర్మాణం ఎవరు, ఎప్పుడు ప్రారంభించారు?
   (సి) దానికి కావలసిన స్థలం అతనికి ఇచ్చినవారెవరు?
4. ఆంగ్లేయులు కలకత్తాలో నిర్మించిన కోట పేరేమిటి? ఎప్పుడు నిర్మించబడింది?
5. తన సేనాధిపతి చేత బంధీ చేయబడిన మొగల్ చక్రవర్తి ఎవరు?
   (ఎ) ఆ సేనాధిపతి ఎవరు?
   (బి) చక్రవర్తి ఎలా బయటపడ్డారు?
6. క్రీస్తుశకం ఏ సంవత్సరంనుంచి విక్రమ శకం లెక్కింపబడుతున్నది?
7. క్రీస్తుశకం ఏ సంవత్సరంనుంచి శాలివాహన శకం లెక్కింపబడుతున్నది?
8. క్రీస్తుశకం ఏ సంవత్సరంనుంచి గుప్తుల శకం లెక్కింపబడుతున్నది?

(VIII పేజీ చూడండి)

## పరిశోధనలు, అన్వేషణలు ఇతర విశేషాలు

1. చీనా చక్రవర్తి ఆస్థానంలో ఉన్నతఅధికారిగా పనిచేసిన ఐరోపా దేశస్థుడెవరు?
   (ఎ) ఆ చక్రవర్తి ఎవరు?
   (బి) ఆ ఐరోపాదేశస్థుడి సాహసాలు ఎలా తెలియవచ్చాయి?
   (సి) ఆయనతోపాటు వున్న మరో ఇద్దరు ఐరోపాదేశస్థులు ఎవరు?
2. బ్రహ్మపుత్ర, సింధు, సట్లజ్ నదుల జన్మస్థానాలను కనుగొన్న ఐరోపా దేశస్థుడెవరు?
3. మనిషికన్నా కొన్ని వేల సంవత్సరాల పూర్వం కాగితం వంటిదాన్ని తయారుచేసిన ప్రాణులు ఏవి?
4. తన కడుపు లోపలి భాగాన్ని వెలుపలికి తీసుకురాగల ప్రాణి ఏది?
5. ఒక ఐసు ముక్కను ఒక గ్లాసు నీళ్ళలో కరిగించినట్టయితే నీటి మట్టం పెరుగుతుందా?
6. మొట్టమొదటి విమానం నమూనాను తయారుచేసిన వారెవరు?
7. మొట్టమొదటిసారిగా చంద్రుడి ఫోటో ఎప్పుడు తీయబడింది?



(VIII పేజీ చూడండి)




1. విక్రమాదిత్యుడి ఆస్థానాన్ని అలంకరించిన తొమ్మండుగురు మేధావులు ఎవరు?
2. నాయనార్లు ఎవరు?
3. ఆళ్వార్లు ఎవరు?
4. మన దేశంలోని ప్రాచీన గ్రంథాలు ఏవి?
   (ఎ) అవి ఎన్ని?
   (బి) వాటిని రచించిన వారెవరు?
   (సి) వాటిని పరిష్కరించి సంకలనం చేసినవారెవరు?
   (డి) వేదాలకు ఉన్న మరొక పేరేమిటి?
   (ఇ) వాటికి ఆ పేరెలా వచ్చింది?
5. వేదాలకు తరవాత వచ్చే గ్రంథాలు ఏవి?
   (ఎ) అవి ఎన్ని?
   (బి) వాటిలో ప్రధానమైనవి ఎన్ని?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: సాయంకాలం

అస్సామీ: సంధియా; బెంగాలీ: సంధ్య; ఇంగ్లీష్: ఈవినింగ్; గుజరాతీ: సంజ్; హింది: షామ్; కన్నడం: సంజె; కాశ్మీరీ: షామ్; మలయాళం: వైకున్నేరమ్; మరాఠీ: సంధ్యాకాల్; ఒరియా: సంధ్య; పంజాబీ: లోటావెలా; సంస్కృతం: సంధ్యా; సింధి: షామ్; తమిళం: మాలై; ఉర్దూ: షామ్.

## మీరు నమ్ముతారా?

* జూలియస్ సీజర్ రోమన్ చక్రవర్తా?
* ఆకాశం నీలంరంగుతో వుంటుందా?
* భారతదేశంలో మాత్రమే హిందువులు అధిక సంఖ్యాకులా?

కానే కాదు!

- అతడు ఎంతో ఆశించినప్పటికీ 'చక్రవర్తి' అనే బిరుదు సాధించలేకపోయాడు.
- ఆకాశానికి రంగు లేదు. భూమికి చుట్టూ వున్న వాతావరణంగుండా సూర్యుడి వెలుతురు రావడంవల్ల నీలంగా కనిపిస్తుంది.
- కాదు. నేపాల్‌లో కూడా అధిక సంఖ్యాకులే!

# సమాధానాలు

### ఎవరాయన?

ఆదిశంకరులు.

### చరిత్ర

1. 'కరునాడు' అనే పదం నుంచి కర్ణాటక వచ్చింది. కరునాడు అంటే 'ఎత్తయిన నల్లటి భూమి' అని అర్థం.

2. థాయ్‌లాండ్ రాజధాని.

3. మద్రాసు నగరం.
(ఎ) సెయింట్ జార్జ్ కోట.
(బి) ఈస్టిండియా కంపెనీకి చెందిన ఫ్రాన్సిస్‌డే. 1640 వ సంవత్సరంలో.
(సి) చంద్రగిరి రాజు.

4. విలియంకోట, 1696—1715 మధ్య నిర్మించబడింది.

5. జహంగీర్ చక్రవర్తి.
(ఎ) మొహబత్ ఖాన్.
(బి) రాణి నూర్జహాన్ ఉపాయంతో.

6. క్రీ. పూ. 58 నుంచి.

7. క్రీ. శ. 78

8. క్రీ. శ. 319–20

### లోకజ్ఞానం

1. మార్కోపోలో.
(ఎ) కుబ్లాఖాన్.
(బి) మార్కోపోలో ఇటలీకి తిరిగివెళ్ళాక, యుద్ధంలో పాల్గొని, ఖైదీ అయ్యాడు. జైలు లోపల అతడు తన జ్ఞాపకాలను చెప్పి రాయించాడు.
(సి) అతని తండ్రి నికోలోపోలో; బాబాయి మాఫోపోలో.

2. స్వెన్ అండర్స్ హెడిన్ (1865—1952).

3. కందిరీగలు

4. స్టార్‌ఫిష్

5. పెరగదు.

6. లియొనార్డో డా విన్సి

7. 1841 వ సంవత్సరంలో.

### సాహిత్యం

1. కాళిదాసు, భేతాళభట్టు, ఘటకర్పర, వరాహమిహిరుడు, క్షపణకుడు, అమర సింహుడు, వరరుచి, శంకువు, ధన్వంతరి.

2. ప్రాచీన తమిళనాడులోని శివభక్తులు.

3. ప్రాచీన తమిళనాడుకు చెందిన విష్ణు భక్తులు.

4. వేదాలు.
(ఎ) నాలుగు.
(బి) పురాతన ఋషులు.
(సి) వేదవ్యాసుడు.
(డి) శ్రుతి.
(ఇ) అది లిఖించబడకుండా తరతరాలుగా పండితులు విని జ్ఞాపకం వుంచుకుంటూ రావడంవల్ల. శృతి అంటే 'విన్నది' అని అర్థం.

5. ఉపనిషత్తులు.
(ఎ) నూట ఎనిమిది.
(బి) పదహారు.



# నెహ్రూ కథ – 2

జవహర్‌లాల్ పదేళ్ళ ప్రాయంలో, అతని తల్లిదండ్రులు తమ నివాసాన్ని నూతన భవంతి—'ఆనందభవన్'కు మార్చారు. బ్రహ్మాండమైన నూతన భవనాన్నీ, పరిసర ప్రాంతాలనూ చూసి బాల జవహర్ అమితమైన ఆనందోత్సాహాలు పొందాడు.

తనతో ఆడుకోవడానికి తమ్ముడు గానీ, చెల్లెలు గానీ లేకపోవడం, జవహర్‌కు కొరతగా ఉండేది. కొన్నేళ్ళకు చెల్లెలు పుట్టింది. ఆ విషయం తెలియజేస్తూ డాక్టర్, జవహర్‌తో, "నీకు చెల్లెలే పుట్టింది. అదృష్టవంతుడివి; ఆస్తిపంచుకునే తమ్ముడు కాదు!" అన్నాడు. తనను అంత స్వార్థపరుడిగా భావించినందుకు, జవహర్‌కు డాక్టర్ మీద కోపం వచ్చింది.





మోతీలాల్ ఇంగ్లాండుకు వెళ్ళివచ్చాడు. అప్పుడు శ్రోత్రియులయిన కాశ్మీరీ బ్రాహ్మణులు—సముద్రం దాటి వెళ్ళినందుకు మోతీలాల్‌ను ప్రాయశ్చిత్తం చేయమన్నారు. కాని, మోతీలాల్ నిరాకరించాడు. ఆ సమయంలో వాళ్ళ మధ్య ఇదొక పెద్ద దుమారం లేపింది. ఆనాడు, మూఢనమ్మకానికీ, బుద్ధివాదానికి జరిగిన సంఘర్షణను అర్థం చేసుకున్నాడు జవహర్.



ఎఫ్. టి. బ్రూక్స్ అనే ఆంగ్లేయ ఉపాధ్యాయుడి పాఠాలతో జవహర్‌లాల్ విద్యాభ్యాసం ప్రారంభమయింది. 'అలిసెస్ అడ్వెంచర్స్,' 'ది జంగిల్ బుక్', 'డాన్ క్విక్సోట్' మొదలైన ఇంగ్లీషు పుస్తకాలు అతన్నెంతో ఆకర్షించాయి. అవి అతనికి ఊహాలోకాలను చవిచూపాయి.

బ్రూక్స్—భౌతికకాయాన్ని వదిలిపెట్టి అదృశ్యమైన ఆత్మద్వారా ఒక చోటి నుంచి, మరొక చోటికి చేరుకోవచ్చునని విశ్వసించే 'దివ్యజ్ఞానమతా'వలంబి. తరచూ ఇటువంటి విషయాలు వినడం వల్ల జవహర్‌లాల్ కూడా—మేఘాల మధ్య ఎగురుతున్నట్టు రాత్రులలో కలలు కనేవాడు!





రష్యా—జపాన్ యుద్ధ విశేషాలను వార్తాపత్రికలలో చదివినప్పుడల్లా, జవహర్‌లో జాతీయభావాలు వెల్లువిరిసేవి. పూర్వకాలపు సైనికుడిలా కత్తిచేతబట్టి భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నట్టు అతనిలో తరచూ ఊహలు కలిగేవి!

పదిహేనవయేట అతడు తల్లిదండ్రుల వెంట ఇంగ్లాండుకు వెళ్ళాడు. లండన్ చేరిన మరునాడే సుప్రసిద్ధమైన డెర్బీ రేస్ (గుర్రప్పందాలు) చూడడానికి వెళ్ళాడు. ఆనాడు ఇంగ్లండులో వున్న పలువురు భారతీయ ప్రముఖులను జవహర్‌లాల్ చూశాడు.





ఆ తరవాత అతడు చదువుకోసమని హారో వెళ్ళాడు. తల్లిదండ్రులు అతన్ని అపరిచితుల మధ్య వదిలారు. మొదట ఒంటరిగా ఉన్నట్లు భావించి నప్పటికీ, క్రమంగా అక్కడి వాతావరణానికి అలవాటు పడడంతోపాటు, జవహర్‌లాల్ ఆటలలో ఆసక్తి కనబరచసాగాడు.

1905 వ సంవత్సరం ఇంగ్లాండులో జరిగిన సాధారణ ఎన్నికల గురించిన వార్తలను జవహర్‌లాల్ పత్రికలలో ఆసక్తితో చదివేవాడు. ఒకనాడు ఉపాధ్యాయుడు ఎన్నికల ఫలితాలు గురించి అడిగినప్పుడు, తరగతిలో ఒక్క జవహర్‌లాల్ మాత్రమే సంతృప్తికరమైన సమాధానం ఇవ్వగలిగాడు.





మాతృదేశంలో జరుగుతూన్న సంఘటనలను జవహర్‌లాల్ ఆసక్తితో గమనిస్తూ వచ్చాడు. బెంగాల్, పంజాబు, మహారాష్ట్ర ప్రాంతాలలో, దేశభక్తులు బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తూన్న రోజులవి. అయినా, ఆ విషయాలను గురించి మాట్లాడుకోవడానికి, హారోలో అతనికి ఒక్కరూ లభించలేదు.

జవహర్‌లాల్‌కు, స్కూల్లో బహుమతిగా ఒక పుస్తకం ఇచ్చారు. అది ఇటలీకి చెందిన దేశభక్తుడూ, విప్లవకారుడూ అయిన గారిబాల్డి జీవితచరిత్ర. ఆ మహావీరుడి జీవితాన్ని చదివి జవహర్‌లాల్ ఎంతో ఉత్తేజితుడయ్యాడు. ఆయన మనస్సులో ఇటలీ, భారత దేశాలు రెండూ కలిసిపోయాయి!





మానసికంగా ఎదుగుతూన్న జవహర్‌లాల్‌కు హారో చిన్న ప్రదేశంగా కనిపించింది. కేంబ్రిడ్జికి వెళితే బావుంటుందని తండ్రికి తెలియజేశాడు. మోతీలాల్ అందుకు అంగీకరించాడు. హారోలో రెండేళ్లు గడిపి, జవహర్‌లాల్ కేంబ్రిడ్జికి పయనమయ్యాడు. —(ఇంకావుంది)



# సీతయ్య పెళ్ళి

సీతాపురంలో సీతయ్య అనే అమాయకు డుండేవాడు. వారసత్వంగా సంక్రమించిన ఆస్తి వున్నప్పటికీ, వాడు కష్టపడి జీవించే వాడు. వాడికి పిల్లనివ్వాలని ఊళ్ళో చాలా మంది అనుకుంటున్న సమయంలో, పొరుగూరు నుంచి రుద్రయ్య అనే మోస గాడు వచ్చాడు. వాడి వెంట ఒక అనాకారి పిల్ల వున్నది.

ఊళ్ళో అందరితోనూ వాడు, "ఈ పిల్ల నా కూతురు. ఆ మధ్య రెండు నెలల క్రితం సీతయ్య, మా ఊరు వచ్చినప్పుడు దీన్ని పెళ్ళి చేసుకున్నాడు. వచ్చి కాపు రానికి తీసుకువెళతాడని యిన్నాళ్ళూ ఎదురుచూసి, యింక విసిగిపోయి నేనే, దీన్ని తీసుకువచ్చాను. సీతయ్య, నా కూతురుకు అన్యాయం చేస్తాడేమోనని, అనుమానంగా వున్నది. మీరందరూ నాకు సాయపడాలి," అని చెప్పాడు.

ఈ విడ్డూరమేమిటో చూడాలని, ఊళ్ళో చాలామంది రుద్రయ్యతోపాటు సీతయ్య యింటికి వెళ్ళారు. సీతయ్య తనకా పిల్ల ఎవరో తెలియదన్నాడు.

"తెలియదని బింకాలు పలికితే సరి పోదు. నేను మా ఊరునుంచి సాక్ష్యాలు తీసుకురాగలను," అన్నాడు రుద్రయ్య.

సీతయ్య, గ్రామాధికారి దగ్గరకు వెళ్ళి, తనను రుద్రయ్య బారినుంచి రక్షించ మన్నాడు. వాడు అమాయకుడని తెలిసిన గ్రామాధికారి, వాణ్ణి ఎలా కాపాడాలా అని ఆలోచిస్తూండగా, మర్నాడు గ్రామా నికి మరొక వ్యక్తి వచ్చాడు. వాడు తన పేరు లక్ష్మయ్య అని చెప్పాడు. వాడి వెంట ఎంతో అందమైన యువతి వున్నది.

వాడు కూడా గ్రామస్థులతో, సీతయ్య నాలుగు నెలల కిందట, తన గ్రామానికి వచ్చినప్పుడు, తన కూతుర్ని పెళ్ళి చేసు



కున్నాడని చెప్పాడు. సీతయ్య తన కేమీ తెలియదని గోలపెడితే, "నీకాక్కవాలంటే లకవరహాలు కట్నంగా యిస్తాను. నా కూతురుకు అన్యాయం చేయకు!" అన్నాడు.

సీతయ్య అందుకు ఒప్పుకోలేదు.

లక్ష్మయ్య, గ్రామాధికారికి ఫిర్యాదు చేశాడు. అప్పటికే రుద్రయ్య కూడా గ్రామాధికారి దగ్గిర వున్నాడు.

గ్రామాధికారి యిద్దరు చెప్పిందీ విని, "మీరు చెప్పిందాన్నిబట్టి, సీతయ్య ముందుగా లక్ష్మయ్య కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె అందగత్తె; ధనవంతురాలు. ఆమెను పెళ్ళి చేసుకునివుంటే, సీతయ్య తిరిగి యింకొక ఊరు వెళ్ళి, రుద్రయ్య కూతుర్ని పెళ్ళి చేసుకుని వుండడు. కాబట్టి, మీ యిద్దరిలో ఒకరు అబద్ధం చెబుతున్నారు, అవునా?" అన్నాడు.

రుద్రయ్య, తన కూతురు పెళ్ళికి సాక్ష్యాలు తేగలనన్నాడు. లక్ష్మయ్య తనూ సాక్ష్యాలు తెస్తానన్నాడు. ఇద్దరూ వాదులాటకు దిగారు.

ఆ సమయంలో అక్కడికి, ఒక కసాయి వాడు వచ్చాడు. వాడు రుద్రయ్య కూతురు కేసి చూస్తూ, "నువ్విక్కడున్నావా! కసాయివాణ్ణి పెళ్ళి చేసుకుంటే, చచ్చిన జంతువుల చర్మాలు వలవాలని తెలియదా? ఆ సంగతి నువ్వు పెళ్ళికి ముందే ఆలోచించుకుని వుండవలసింది. పెళ్ళి చేసుకున్నాక ఇంట్లోంచి పారిపోతే, నేనూరుకుంటానా? నాతోపద!" అన్నాడు.

"ఈ అమ్మాయితో నీకు పెళ్లయిందా?" అని అడిగాడు గ్రామాధికారి ఆశ్చర్యంగా.

"అవును. ఈమె నా భార్య. అందుకు సాక్షులను కూడా వెంటబెట్టుకుని వచ్చాను. వాళ్లు వీధిలో నిలబడ్డారు. పిలవమంటే పిలుస్తాను!" అన్నాడు కసాయివాడు.

గ్రామాధికారి సాక్షులను పిలిపించాడు. కసాయివాడు, అనాకారి పిల్లను పెళ్ళి చేసుకున్నట్టు, వాళ్ళు చెప్పారు.

"ఇంక వేరే సాక్ష్యాలు అవసరం లేదు. రుద్రయ్య కూతురు, సీతయ్య భార్య కాదు," అన్నాడు గ్రామాధికారి.

"అవన్నీ అబద్ధపు సాక్ష్యాలు! నేనీ కసాయి వెంట వెళ్ళను." అని అనాకారి పిల్ల ఎదురుతిరిగింది.

"నీ తండ్రి రుద్రయ్య, రెండు నెలల క్రితం, యీ కసాయివాడికి నిన్నిచ్చి పెళ్లి చేసినట్టు సాక్షులు రుజువు చేశారు. నువ్వు, నీ భర్తతో వెళ్ళి తీరవలసిందే!" అన్నాడు గ్రామాధికారి.

ఆయన యిలా అనగానే, అనాకారిపిల్ల కళ్ళనీళ్ళు పెట్టుకుని, "ఈ రుద్రయ్య, నా తండ్రి కాదు; మేనమామ. ఈ సీతయ్య అమాయకుడని తెలిసి, అతడి ఆస్తి మీద పెత్తనం చెలాయించేందుకు, యీ నాటకం ఆడుతున్నాడు. నాకూ, సీతయ్యకూ పెళ్ళి కాలేదు. నిజం ఒప్పుకుంటున్నాను. దయ చేసి నన్ని కసాయివాడిపాలు చేయకండి." అన్నది.

"సమస్య తీరిపోయింది. ఇక సీతయ్య, లక్ష్మయ్య కూతుర్ని ఏలుకోవచ్చు." అన్నాడు గ్రామాధికారి.

"నిజం చెబుతున్నాను. నేనీ పిల్లను కూడా పెళ్ళి చేసుకోలేదు." అన్నాడు సీతయ్య దీనంగా.

"పోనీ నీ మాటే నిజమనుకుందాం. ఇప్పుడు నా కూతుర్ని పెళ్ళి చేసుకునేందుకు, నీకేమైనా అభ్యంతరమా?" అని అడిగాడు లక్ష్మయ్య.



సీతయ్య ఆశ్చర్యపోయి, "నా కిదంతా అయోమయంగా వున్నది. ఇక్కడ ఏం జరుగుతున్నదో కూడా అంతుబట్టడం లేదు." అన్నాడు.

అప్పుడు లక్ష్మయ్య అందరికీ, అసలు విషయం వివరించి చెబుతూ, "నేను, నా కూతురుకు మంచి వరుడి కోసం వెదుకుతున్నాను. నా కూతురు అమాయకురాలు. పెళ్ళయ్యాక భర్త దాన్ని మోసం చేస్తాడని, నా భయం. ఆ సమయంలో నాకు, సీతయ్యను గురించి తెలిసింది. అతణ్ణి పరీక్షించాలనుకున్నాను. అప్పుడే నాకు, రుద్రయ్య వేస్తున్న పథకం గురించి, వాళ్ళ ఊరువాడొకడు చెప్పాడు. రుద్రయ్య ఆటకట్టించేందుకే, యీ కసాయివాడి సాయం కోరాను," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"వాడి కసాయితనం మంచి ఫలితాన్నే యిచ్చింది! ఇంతకూ సీతయ్య గురించి నువ్వేమనుకుంటున్నావు?" అని అడిగాడు గ్రామాధికారి.

"సీతయ్య అమాయకుడే కావచ్చు. కాని, అబద్ధాలకు భయపడి తేలికగా లొంగిపోడని రుజువయింది. సీతయ్య స్థానంలో మరొకడుంటే, నేనిస్తానన్న లక్ష వరహాలకు ప్రలోభపడి, అందమైన నా కూతుర్ని ముందే పెళ్ళి చేసుకున్నట్టు ఒప్పేసుకునేవాడు. సీతయ్య నిజాయితీపరుడని తేలిపోయింది." అన్నాడు లక్ష్మయ్య.

"అందువల్ల నీకు కలగబోయే మేలేమిటి?" అని ప్రశ్నించాడు గ్రామాధికారి.

"అయ్యా, సీతయ్యకు ప్రపంచంలోని మోసగాళ్ళ బారినుంచి తప్పించుకోవడానికి, నావంటివాళ్ళ సాయం కావాలి. నా కూతుర్ని పెళ్ళి చేసుకుంటే, నేనతడికి అండగా వుంటాను. మీ అందరి ఎదటా, నా సమర్థతను రుజువు చేసుకున్నా గదా! సీతయ్య నిర్ణయమేమిటో వినాలనుకుంటున్నాను," అన్నాడు లక్ష్మయ్య.

లక్ష్మయ్య కూతుర్ని పెళ్ళాడేందుకు, సీతయ్య సంతోషంగా అంగీకరించాడు.





# కృష్ణావతారం

యాదవులు జరాసంధుడు మొదలుగా గల రాజుల సేనలను ఓడించి, విజయోత్సాహంతో సింహనాదాలు చేస్తూ, విజయ దుందుభులు మోగిస్తూ, బలరాముణ్ణీ, సాత్యకినీ ముందుంచుకుని ద్వారకకు తిరిగిపోయారు.

కృష్ణుడు రుక్మిణిని తీసుకుని వెళ్ళిపోగానే శ్రుతపర్వుడు రుక్మిని తన రథం మీద కూర్చోబెట్టుకుని బయలుదేరాడు. అయితే రుక్మి, తన చెల్లెలైన రుక్మిణిని తీసుకురాకుండా కుండినపురం ప్రవేశించనని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు; ఆ ప్రతిజ్ఞ విఫలం అయింది గనక, అతను భోజకటకమనే నగరం నిర్మించి, అందులోనే ఉండిపోయాడు.

జరాసంధుడు మూర్ఛ తెలియగానే చెల్లాచెదరైన తన సేనలను తిరిగి ఏకం చేసుకుని, పూర్తిగా నవ్వుల పాలైపోయిన శిశుపాలుణ్ణి వెంటబెట్టుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.

యాదవవృద్ధులు కృష్ణుడి వివాహానికి ముహూర్తం నిశ్చయించి, బంధుకోటికీ, ఇతర రాజులకూ ఆహ్వానాలు పంపారు. రాచనగరుకు పెళ్ళిముస్తాబు జరిగింది. మణులు కూర్చిన గోడలను కుంకం పువ్వుతో తుడిచి ధగధగా మెరిసేటట్టు చేశారు. బంగారు స్తంభాలకు కట్టిన గుడ్డలు ఊడదీసి, వాటిపైనున్న చెక్కడపు పనితనం అందరికీ కనపడేలాగు చేశారు. గచ్చునేలల మీద కస్తూరి నీరు పోసి రుద్ది

18. శంబరాసుర వధ



మెరుగుపెట్టారు. రకరకాల ముత్యాల ముగ్గులు చక్కగా అలంకరించారు. అంతటా పోకమానులూ, అరటిచెట్లూ అమర్చి, లేత రావి ఆకులతోనూ, మామిడాకులతోనూ అందమైన తోరణాలు గట్టి, చీనాంబరాలతో తయారుచేసిన ధ్వజాలెత్తారు.

కృష్ణుడి పెళ్ళికి అతని బంధువులూ, అనేకమంది రాజులూ తమ తమ వైభవాలు ఉట్టిపడేలాగా, రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంటబెట్టుకుని ఎంతో స్నేహభావంతో వచ్చారు. కృష్ణుణ్ణి చూసి తమ తపస్సులు ఫలింపజేసుకుందామని మునులు వచ్చారు. ఇంకా, నాలుగు వర్ణాలకూ చెందిన పలువురు ప్రముఖులు నానా దేశాల నుంచి పెళ్ళికి తరలి వచ్చారు. వచ్చిన వారందరికీ సాత్యకి తగిన సత్కారాలు జరిపి, వసతులు ఏర్పాటు చేశాడు.

పెళ్ళిరోజు వచ్చింది. ఒకవైపు బ్రాహ్మణుల వేదాధ్యయనమూ; మరొకవైపు రాజులకు వంది మాగధులు చేసే కైవారాలూ, స్త్రీలు తిరుగాడుతూంటే కలిగే వారి ఆభరణాల ధ్వనీ, ఏనుగుల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, పెళ్ళి బాజాలూ, ఆకాశాన దేవదుందుభులూ, అన్నీ కలిసి ఎక్కడ చూసినా చాలా సందడిగా ఉన్నది.

నాలుగు బంగారు స్తంభాలతో కళ్యాణ మండపం కట్టి, మాణిక్యాలతోనూ, పువ్వులతోనూ అలంకరించి, రంగవల్లులు చిత్ర విచిత్రంగా రచించి, అందులో మణిమయమయిన వేదిక మీద కృష్ణుడు కూర్చున్నాడు. అతని చుట్టూ ఉగ్రసేనుడూ, వసుదేవుడూ, బలరాముడూ, యదువృద్ధులూ, మునులూ కూర్చున్నారు. పురోహితుడు అగ్నిముఖం చేసి వేల్చుతున్నాడు.

ముహూర్తం వచ్చింది. సౌకుమార్యానికీ, సౌందర్యానికీ, సౌభాగ్యానికీ, సౌశీల్యానికీ ప్రతిరూపంగా కనిపించే రుక్మిణిని

కృష్ణుడు పాణిగ్రహణం చేశాడు. అతని మీద ముత్తయిదువులు అక్షతలనూ, ఆకాశం నుంచి దేవతాస్త్రీలు పుష్పాలనూ ఒకేసారి చల్లారు. బ్రాహ్మణులు ఆశీర్వచనం చేశారు. కృష్ణుడు తన తల్లిదండ్రులకూ, పెద్దలకూ నమస్కారం చేసి, వారి దీవనలు పొందాడు. తరవాత అతను అసంఖ్యాకులైన బ్రాహ్మణులకు ఎనిమిది వేల రథాలూ, పదకొండువేల అయిదు వందల ఏనుగులూ, అంతులేని గుర్రాలూ, ఆవులూ దానం చేసి, నగలనూ, బంగారాన్ని, వెండినీ, దాసదాసీలనూ కానుకలుగా ఇచ్చి, సూతులూ, మాగధులూ, నర్తకులూ, వంది వైతాళికులూ మొదలైన వారికి అంతులేని బహుమానాలిచ్చి, అందరికీ భోజనాలు పెట్టి సంతృప్తులను చేశాడు. పెళ్ళిరోజులు సుఖంగా వెళ్ళిపోయాయి. పెళ్ళికి వచ్చినవారు కృష్ణుడికి కట్నాలు చదివించి, అతని చదివింపులు అందుకుని సంతోషంగా వెళ్ళిపోయారు.

కృష్ణుడు రుక్మిణితో దాంపత్య సౌఖ్యంలో ఓలలాడుతూనే, మిత్రవిందా, జాంబవతీ, సత్యభామా, కాళిందీ, సుదంతా అనేవారిని కూడా పెళ్ళాడాడు.

కొద్ది కాలానికే కృష్ణుడి అగ్రభార్య అయిన రుక్మిణి గర్భవతి అయింది. కృష్ణుడు తన హోదాకు తగినట్టుగా ఆమెకు పుంసవనమూ, సీమంతమూ మొదలైన వేడుకలు జరిపాడు. కాల





క్రమాన రుక్మిణి అందమైన ఒక మగ శిశువును ప్రసవించింది. పూర్వం శివుడి మూడో కంటి మంటకు భస్మమైన మన్మథుడే ఇప్పుడు రుక్మిణి కడుపున జన్మించాడు. అతనికి ప్రద్యుమ్ను డని పేరు పెట్టుకున్నారు.

రుక్మిణి కడుపున పుట్టే ఈ బిడ్డవల్ల మనకు చావున్నదని ముందే తెలిసి శంబరు డనే రాక్షసుడు, ఏడు రోజుల బాలింత పక్కలో పడుకుని ఉన్న ప్రద్యుమ్నుణ్ణి అర్ధరాత్రివేళ అపహరించి తీసుకు పోయి సముద్రంలో పారేశాడు. ఆ బిడ్డను ఒక పెద్ద చేప మింగింది. ఆ చేపను ఒక జాలరి వలలో పట్టి, అంత పెద్ద చేపను పట్టినందుకు సంతోషించి, దాన్ని తమ రాణి అయిన మాయావతికి కానుకగా ఇచ్చాడు. ఈ జాలరి ఇక్షుమతీపురంలో ఉండేవాడే. ఆ ఇక్షుమతీపురాన్నే శంబరుడు పాలిస్తున్నాడు. మాయావతి శంబరుడి భార్య.

మాయావతి జాలరి ఇచ్చిన చేపను తానే స్వయంగా తరిగి, అందులో అందమైన పిల్లవాడుండటం చూసి ఎంతో ముచ్చటపడి, వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది. తనకు పిల్లలు లేని కారణంచేత శంబరుడు కూడా ఆ పిల్లవాణ్ణి చూసి మురిశాడు.

మాయావతి పెంపకంలో పెరిగిన ప్రద్యుమ్నుడు రాక్షస మాయలన్నీ తెలుసుకున్నాడు; సకల క్షత్రియ విద్యలూ నేర్చుకుంటూ పెరిగి పెద్దవాడయాడు. అతడు ఎంతో అందంగానూ, ఆకర్షణీయంగానూ తయారయాడు. పసితనం నుంచీ అతన్ని పెంచిన మాయావతి ఒకనాడు తనను పెళ్ళాడమని కోరింది. అతను మాయావతితో, "నువు తల్లివి, నేను కొడుకును. నాపైన నీ కిలాటి కోరిక ఎలా కలిగింది? దీని కేదన్నా కారణం ఉంటే చెప్పు," అన్నాడు ఎంతో ఆశ్చర్యంగా.

దానికి మాయావతి, "నీ తండ్రి యాదవ వంశోద్ధారకుడైన కృష్ణుడు, నీ



తల్లి రుక్మిణీదేవి. పురిటిలోనే నిన్ను శంబరుడు సముద్రంలో పారేస్తే దైవికంగా నువ్విక్కడికి చేరావు. నేను నిన్ను ఇంత కాలమూ రక్షించాను. నీ తల్లి నీ మీద బెంగపడి ఉన్నది. నువు వెళ్ళి ఆమె కళ్ళ ఎదట పడు. నన్ను నిరాకరించకు. శంబరుణ్ణి నేను మాయామోహితుణ్ణి చేసి అతని భార్యగా నటిస్తూ వచ్చాను. అతను మన విరోధి. అతన్ని చంపెయ్యి.'' అన్నది.

మాయావతి ఇలా చెప్పేసరికి, ప్రద్యుమ్నుడు వెంటనే శంబరుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ప్రద్యుమ్నుడు శంబరుడి పైన ఏడు మాయలు ప్రయోగించి, విఫలుడై, చివరకు ఎనిమిదవ మాయతో చంపేశాడు.

తరవాత అతను మాయావతిని వెంటబెట్టుకుని మాయాప్రభావంతో ఆకాశమార్గాన ప్రయాణం చేసి, కృష్ణుడి అంతఃపురంలో దిగాడు. అకస్మాత్తుగా తమ మధ్య దిగిన ప్రద్యుమ్నుణ్ణి చూసి కృష్ణుడి భార్య లందరూ భయపడ్డారు. అతని అందచందాలు చూసి సంతోషం కూడా పొందారు. రుక్మిణి ఆ యువకుణ్ణి చూసి, తనకు పుట్టిన బిడ్డ బతికి ఉంటే ఈ పాటికి ఇంతవాడై ఉండేవాడు కదా అనుకున్నది. చూస్తున్నకొద్దీ ఈ కుర్రవాడిలో కృష్ణుడి లక్షణాలు కనిపించి, ఒకవేళ తన కొడుకే బతికి ఉండి ఇలా వచ్చాడేమో అన్న అనుమానం కూడా కలిగింది. కృష్ణుడు కూడా ఆ కుర్రవాణ్ణి ముఖమంతా కళ్ళు చేసుకుని చూస్తూ, ఆనందించ సాగాడు.

ఇంతలో నారదుడు అక్కడికి వచ్చి కృష్ణుడితో ప్రద్యుమ్నుడి కథ అంతా చెప్పాడు. ఇప్పుడు అందరికీ అంతా స్పష్టమైపోయింది. ప్రద్యుమ్నుడు రుక్మిణి కొడుకే. మాయావతి కూడా పూర్వజన్మలో మన్మథుడి భార్య అయిన రతీదేవి. తిరిగి మళ్ళీ అతనికి భార్య అయింది. మన్మ

ధుడు పోయాక ఆమె శంబరుడికి చిక్కి, మాయారూపం ధరించి శంబరుణ్ణి మభ్య పెడుతూ, తన పాతివ్రత్యాన్ని కాపాడుకున్నది.

తన కొడుకు తనకు మళ్ళీ దక్కినందుకు రుక్మిణి పరమానందం చెందింది. కృష్ణుడి భార్యలందరూ ఎంతో సంతోషించి, అంతఃపురంలో ఎన్నో విందులూ, వేడుకలూ చేసుకున్నారు.

రుక్మిణి తొలి కాన్పుకు ప్రద్యుమ్నుణ్ణి కనటమే గాక, వరసగా తొమ్మిదిమంది కొడుకులను కని, చిట్టచివర కొక కూతుర్ని కూడా కన్నది. ప్రద్యుమ్నుడి అనంతరం రుక్మిణి కన్న తొమ్మిదిమంది కొడుకుల పేర్లు చారుధేష్ణుడూ, సుధేష్ణుడూ, సుషేణుడూ, చారుగుప్తుడూ, చారువాహనుడూ, చారువిందుడూ, చారుభద్రుడూ, చారుగర్భుడూ, చారుడూ; కడగొట్టు పిల్ల పేరు చారుమతి. కృష్ణుడికి ఇతర భార్యల యందు భానుడూ, భానువిందుడూ, సంగ్రామజిత్తూ, దీప్తిమంతుడూ, వృకుడూ మొదలుగా గల అనేకమంది కొడుకులూ, మిత్రవతి మొదలైన అనేకమంది కూతుళ్లూ కలిగారు.

ప్రద్యుమ్నుణ్ణి రుక్మిణి కన్న నెల లోపునే జాంబవతి సాంబుడనే కొడుకును కన్నది. అతను ప్రసిద్ధుడు. పసితనంలోనే



బలరాముడు అతన్ని చేరదీసి, తన కొడుకులాగా పెంచాడు, అతనికి యుద్ధవిద్యలన్నీ నేర్పాడు. బలరాముడికి రేవతియందు నిశాతుడూ, ఉల్మకుడూ అనే కొడుకులు కలిగారు. ఈ విధంగా బలరామకృష్ణులు పెద్ద బలగాన్ని కని, ఎంతో సుఖంగా జీవిస్తూ వచ్చారు.

విదర్భదేశంలో రుక్మిణి అన్న అయిన రుక్మికి శుభాంగి అని ఒక కూతురున్నది. ఆ శుభాంగి యుక్తవయస్కురాలయింది. ఆ పిల్లకు తగిన వరుణ్ణి సంపాదించటం కోసం రుక్మి స్వయంవరం ఏర్పాటు చేసి, భూమి మీద ఉండే రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. ఆ స్వయంవరానికి

ఎందరెందరు రాజులో వెళ్ళారు; తన తల్లిదండ్రుల అనుమతి పొంది ప్రద్యుమ్నుడు కూడా సపరివారంగా బయలుదేరి స్వయంవరానికి వెళ్ళాడు. స్వయంవరం యథావిధిగా జరిగింది. శుభాంగి అదివరకే ప్రద్యుమ్నుడి అందచందాలను గురించి విని, అతన్ని వరించటానికి నిశ్చయించుకుని ఉండటం చేత అతని మెడలోనే వరమాల వేసింది. స్వయంవరానికి వచ్చిన ఇతర రాజులందరూ ఆమె నిర్ణయాన్ని మెచ్చుకున్నారు. వధూవరులు ఒకరి కొకరు తగి ఉన్నారని ఎంతగానో శ్లాఘించారు.

ప్రద్యుమ్నుడు శుభాంగిని పెళ్ళాడి సపరివారంగా బయలుదేరి ఇంటికి తిరిగి వచ్చాడు.

కొంతకాలానికి ఆ దంపతులకు అనిరుద్ధుడు పుట్టాడు. అనిరుద్ధుడు పెరిగి పెద్దవాడవుతూ సమస్తశాస్త్రాలూ, శస్త్రాస్త్రవిద్యలూ నేర్చి యుక్త వయస్కుడయాడు. అతనికి పెళ్ళియీడు వచ్చింది.

రుక్మికి రుక్మవతి అనే మనమరాలు, కొడుకు కుమార్తె, ఉన్నది. ఆ పిల్లను అనిరుద్ధుడికి అడగమని కృష్ణుడు సూచించగా ప్రద్యుమ్నుడు దూత ద్వారా రుక్మికి కబురు పంపాడు.

రుక్మి కూడా, పాత పగలు మరచి, సరేనన్నాడు. పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళికి బలరామకృష్ణులూ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులూ, అనిరుద్ధుడూ, రుక్మిణీ, అనేకమంది యాదవముఖ్యులూ తరలి వెళ్ళారు. వివాహం వైభవంగా జరిగింది.

అందరూ మహోల్లాసంగా ఉన్న సమయంలో వేణుధారీ, శ్రుతపర్వుడూ, అంశుమంతుడూ, జయత్సేనుడూ మొదలైన దాక్షిణాత్యులు తమ మిత్రుడైన రుక్మితో, "నువు జూదంలో నేర్పరివిగద. బలరాముణ్ణి కదిలించి చూడు అతను కాస్త వ్యసనపరుడు. అతన్ని ఓడించి మనం ప్రతిష్ఠ సంపాదింతాం," అని బోధించారు.





# కాపూ-తోడేలూ

ఫ్రాన్సుదేశంలో ఇప్పుడు పెద్ద మైదానంగా ఉన్న ప్రాంతంలో ఒకప్పుడు విస్తృతమైన అరణ్యం ఉండేది. ఆ అరణ్యం కాలిపోవటానికి కారణం ఈ విధంగా చెబుతారు:

అరణ్యం అంచున ఒక పేదకాపు తన భార్యతో నివసిస్తూ ఉండేవాడు. ఒకనాడు ఆ కాపు రెండు పెద్ద రొట్టెలు కొని, అరణ్యంకుండా ఇంటికి వస్తూ ఉండగా ఒక పెద్ద తోడేలు చెట్ల చాటునుంచి వచ్చి, అతని దారికి అడ్డంగా నిలబడింది. ఆ తోడేలు బక్కచిక్కి, చర్మం ఎముకలకు అంటుకుపోయి ఉన్నది. అది గుహ లాటి నోరు తెరిచి, కాపుకేసి చూస్తూ గుర్రు పెట్టింది. దాని కోరలు చాలా పెద్దవిగా, భయంకరంగా ఉన్నాయి.

కాపు ఆ తోడేలును చూసి భయంతో కొయ్యబారి పోయాడు. పారిపోవటం అసంభవం. అంత పెద్ద తోడేలుతో అతను పోరాడి జయించనూ లేడు. అంతలో అతనికి ఒక ఆలోచన వచ్చింది. అతను తోడేలుతో, "నీకు, పాపం, ఆకలిగా ఉందా, తోడేలూ! ఈ రొట్టె కొంచెం తిను," అంటూ, ఒక పెద్ద రొట్టె నుంచి ఒక ముక్క తుంపి తోడేలుకు వేశాడు. తోడేలు దాన్ని తీసుకుని ఆప్యాయంగా తినసాగింది. అదే సమయమనుకుని కాపు దాని పక్కగా జారుకుని, ముందుకు పోసాగాడు.

ఎంతో దూరం పోకముందే తోడేలు తనను వెంబడిస్తున్నట్టు అతనికి తెలిసింది. "మంచి తోడేలు! ఇంకాస్త తీసుకో," అని తోడేలుకు మరొక రొట్టె ముక్క వేసి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు కాపు.

కాని, తోడేలు అతన్ని వెంబడించటం మానలేదు. కాపు రొట్టె తుంచి వేస్తూనే

ఫ్రెంచి జానపద కథ



ఉన్నాడు. అతను వేసే రొట్టెముక్కలు తింటూ తోడేలు అతన్ని వెంబడిస్తూనే ఉన్నది. అతను ఎంత వేగంగా పరిగెత్తినా తోడేలు అతన్ని వెంబడించటం మాన లేదు.

చిట్ట చివరకు ఆయాసంతో రొప్పుతూ కాపు తన ఇంటికి వచ్చి పడేసరికి, అతని రెండో రొట్టెలో ఒక చిన్న తుంపు మాత్రమే మిగిలింది. తోడేలు అతని వెనకగా వచ్చి, అతని ఇంటి ముందు కూర్చున్నది.

కాపు భార్య, తన భర్త ఉత్త చేతులతో రావటం చూసి, "రొట్టెలేవీ? రొట్టెలతో తినటానికి అంబలి సిద్ధం చేసి ఉంచాను," అన్నది.

ఊపిరి కూడా అందని స్థితిలో ఉన్న కాపు తన భార్యకు ఇంటి బయట ఉన్న తోడేలును చూపాడు.

"తోడేలే! అందుకే అలా పరిగెత్తు కొచ్చావు! ఇంకా నయం, నువు దానివాత పడలేదు!" అన్నది భార్య.

"మనం తినటానికి కొన్న రొట్టెలు దానికి వేశాను," అన్నాడు కాపు.

"నిక్షేపమంటి రొట్టెను దిక్కుమాలిన తోడేలు మింగేసిందా? ఏం చోద్యం! నువు లోపలికి వచ్చి, తలుపుముయ్యి. లేకపోతే అది నిన్నూ, నన్నూ కూడా మింగేస్తుంది," అన్నది కాపు భార్య.

కాపు తలుపు మూయబోతూ, తన చేతిలో మిగిలిపోయిన రొట్టె తుంపును తోడేలుకు వేస్తూ, "ఇది కూడా నువే తిను, తోడేలూ," అని తలుపు గడియ పెట్టేశాడు.

తోడేలు ఆ ముక్క కూడా కాస్త తినేసి, చాలాసేపు ఆ ఇంటి బయటనే కూర్చున్నది.

లోపల భార్యాభర్తలు ఉత్త అంబలి ఆరగించసాగారు. తింటున్నంతసేపూ కాపు భార్య తోడేలును శాపనార్థాలు పెడుతూనే ఉన్నది. లోపల సంభాషణ ముగియగానే తోడేలు అరణ్యంలోకి వెళ్ళిపోయింది.

తరవాత కొన్ని నెలలు గడిచాయి. కాపూ, అతని భార్యా కష్టపడి పని చేసి కొంత డబ్బు కూడబెట్టి, దానితో ఒక ఆవును కొనటానికి నిశ్చయించారు.

కాపు ఆ డబ్బు తీసుకుని అరణ్యం కుండా సంతకు బయలుదేరాడు. సంతలో అతను తన దగ్గిర ఉన్న డబ్బుకు ఏ వయసు మళ్ళిన ఆవుగాని వస్తుందేమో నని చూస్తుండగా ఒక సన్నని పొడుగాటి మనిషి అతనికి ఎదురుపడి, "ఆవును కొంటున్నావా ?" అని అడిగాడు.



"అవునండీ! కాని నా దగ్గిర మంచి ఆవును కొనటానికి తగినంత డబ్బు లేదు," అన్నాడు కాపు.

"దాపులనే వున్న మా కొట్టంలో చాలా ఆవులున్నాయి. వాటిలో నీకేదన్నా నచ్చు తుందేమో వచ్చి చూడు," అన్నాడు ఆ పెద్దమనిషి.

ఇద్దరూ కలిసి ఒక చక్కని ఇంటికి వెళ్ళారు. ఇంటి వెనక ఆవుల కొట్టం ఉన్నది.

"అన్నిటిలోకి మంచి ఆవును ఏరుకో," అన్నాడు పెద్దమనిషి. కాపు ఆ ఆవులలో తనకు శ్రేష్ఠంగా కనిపించిన దాన్ని ఎన్ను కున్నాడు.

"మంచి ఆవునే ఏరుకున్నావు," అంటూ ఆ పెద్దమనిషి ఆ ఆవు మెడకు పలుపు కట్టి, దాని చివర కాపు చేతికి అందించాడు.

తరవాత ఆయన తన జేబులో నుంచి ఒక డబ్బీ తీసి, "ఇది నీ భార్యకు నా కానుక. అందులో ఏమున్నదీ ఆమెనే చూసుకోమను—ఆమె ఒంటరిగా ఉన్న ప్పుడే చూడమను సుమా!" అన్నాడు.

కాపు ఆశ్చర్యంతో ఆ డబ్బీని అందు కుంటూ, "తమకు మా మీద ఎందుకింత దయ ?" అని అడిగాడు.

పెద్ద మనిషి నవ్వి, "నువ్వు ఒకనాడు నా మీద దయతలిచి నాకు రెండు రొట్టెలు పెట్టావు కావా? అవును, నేనే ఆతోడేలును. నేను మంచివాళ్ళకి మంచివాణ్ణి. చెడ్డ

వాళ్ళకు చెడ్డవాణ్ణి. ఇక నువు వెళ్ళు. దేవుడు నీకు మేలు చెయ్యాలి!'' అన్నాడు.

ఇది విని కాపుకు ఆనందమూ, ఆశ్చర్యమూ కూడా కలిగాయి. అతను ఆవుతో అడవిదారిని ఇంటికి బయలుదేరాడు.

దారి పొడుగునా కాపు ఆ డబ్బీలో ఏమున్నదో తెలుసుకోవాలని తహతహలాడాడు. దాన్ని తన భార్య ఒంటరిగా ఉన్నప్పుడే తెరవాలని ఆ తోడేలు మనిషి ఎందుకు అన్నాడు? కాపు డబ్బీ పైకి తీసి అటూ, ఇటూ తిప్పి చూశాడు. వాసన చూశాడు. కాని అందులో ఏమున్నదీ అంతు చిక్కలేదు.

తన భార్యకూ, తనకూ మధ్య రహస్యాలు లేవు. అందుచేత ఆమె డబ్బీలో ఏమున్నదీ తప్పక చెబుతుంది. ఆ భాగ్యానికి ఇంటికి పోయినదాకా ఆగటం దేనికి? కాపు డబ్బీ తెరిచి, అందులో ఏమున్నదీ చూడటానికే నిశ్చయించుకున్నాడు.

అతను ఆవును మెయ్యటానికి వదిలి, ఒక చెట్టు కింద కూర్చుని, భద్రంగా డబ్బీ మూత తెరిచాడు. మరుక్షణమే అతను డబ్బీని కింద వదిలేసి, చివాలున లేచి దూరంగా వెళ్ళాడు. ఎందుకంటే డబ్బీలో నుంచి బ్రహ్మాండమైన జ్వాల పైకి వచ్చింది.

ఆ జ్వాలకు చెట్టుకొమ్మలు భగ్గుమని అంటుకున్నాయి.

''అమ్మయ్యో, నా భార్యే ఈ డబ్బీ తెరిచి ఉంటే, దాని జుట్టూ, ముఖమూ కాలిపోయి ఉండేవే! ఆ రాత్రి అంబలి తాగుతూ తనను శాపనార్థాలు పెట్టినందుకు తోడేలుమనిషి నా భార్య మీద పగతీర్చుకోవాలని చూశాడు!'' అనుకున్నాడు కాపు.

ఇప్పుడు చెట్టు నిలువునా తగలబడుతున్నది. కాపు తన ఆవును తీసుకుని గబగబా ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ నిప్పే అరణ్యంలో చాలా భాగం తన పొట్టన పెట్టుకున్నది. అయితే కాపూ, అతని భార్యా ఆవును పెట్టుకుని చాలాకాలం సుఖంగా బతికారు.






# గడసు ఇల్లాలు

మురారి అనే యువకుడికి, పట్టణంలోని ప్రభుత్వకచేరీలో చిన్న ఉద్యోగం. అతడి భార్య కామాక్షి కొత్తగా కాపరానికి వచ్చింది. అద్దె తక్కువని అతడు ఊరికి దూరంగా వున్న, ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాడు.

కామాక్షి ఇల్లు సర్దుతూంటే, "బావున్నావా, చెల్లెమ్మా? ఇల్లు నచ్చిందా?" అంటూ ఒకతను లోపలికి వచ్చాడు.

"ఇంట్లో చేరగానే, మా వదినకు పెద్ద పని పడినట్టుందే!" అంటూ అతనికి వెనకగా, ఒక ఆడమనిషి వచ్చింది.

మురారి, వాళ్ళిద్దర్నీ జనార్దనం, జానకిలుగా భార్యకు పరిచయం చేసి, "ఇక్కడికి వీరి ఇల్లు చాలా దగ్గిర. మంచి కలుపుగోలుతనం కలవారు," అన్నాడు.

ఆ తర్వాత, వాళ్ళిద్దరూ కామాక్షికి వంటపనిలోనూ, మురారికి ఇంట్లో సామానులు సర్దిపెట్టడంలోనూ సాయపడ్డారు. కబుర్లు చెప్పుకుంటూ నలుగురూ భోజనాలు చేశారు. చీకటి పడుతూండగా జనార్దనం దంపతులు, తమ ఇంటికి వెళ్ళిపోయారు.

"వీళ్ళ సాయంతో, నాలుగు రోజులు పడుతుందనుకున్న పని, ఒక్క రోజులో పూర్తయిపోయింది," అన్నది కామాక్షి సంతోషంగా.

అయితే, ఆమె సంతోషం ఎంతోకాలం నిలవలేదు.

కామాక్షి వంట ముగించి, భర్తకు భోజనం పెట్టి, అతడు కచేరీకి వెళ్ళిపోగానే, జానకి వచ్చి కూర్చునేది. ఆమెను ఎదురుగా పెట్టుకుని, భోజనం చేయడానికి యిబ్బందిగా వుండేది, కామాక్షికి. వండిన అన్నం యిద్దరూ సర్దుకు తినవలసి వచ్చేది. పైపెచ్చు, సాయంత్రం దాకా

మాచిరాజు కామేశ్వరరావు

జానకి చెప్పే కబుర్లు వినడం, తల నొప్పిగా వుండేది, కామాక్షికి. ఎండవేళ కొద్దిసేపు నిద్రపోవడానికి కూడా, ఆమెకు అవకాశం చిక్కేదికాదు.

ఇక జానకి భర్త జనార్దనం, మురారి సాయంత్రానికి ఇంటికి తిరిగి రాగానే, తానూ వచ్చి, ఇంటిముందు గదిలో కూర్చుని, అతడితో కబుర్లు ప్రారంభించే వాడు. మురారితోపాటు హాయిగా ఫలహారం తిని, చీకటిపడ్డాక తిన్నగా ఇంటికి వెళ్ళే వాడు. కొత్తగా కాపరానికి రావడంవల్ల, కామాక్షి కొన్నాళ్ళపాటు యిదంతా ఎంతో ఓర్పుతో సహించింది.

ఒకనాడు ఆమె, భర్తతో, ''ఈ జనార్దనం దంపతులు, పీడలా దాపురించారు. వీళ్ళ పుణ్యమా అని, మనం నదీతీరంలో వున్న గుడికి కూడా, సాయంకాలం వేళల్లో వెళ్ళలేక పోతున్నాం,'' అన్నది.

భార్య మాటలకు, మురారి నవ్వి ఊరు కున్నాడు. భర్త చాలా మొహమాటస్థుడని, కామాక్షి కాపరానికి వచ్చిన వారం రోజుల్లోనే గ్రహించింది.

''రేపు జనార్దనం రాగానే, గుడికి పోతున్నామని చెప్పి బయలుదేరి వెళదాం,'' అన్నది కామాక్షి.

''అలా చేయడం, ఏం మర్యాదనిపించు కుంటుంది!'' అన్నాడు మురారి.

ఇక భర్తకు చెప్పి ప్రయోజనం లేదనీ, తానే ఏదో ఒకటి చేయాలనీ, కామాక్షి నిశ్చయించుకున్నది.



వారం తర్వాత, జనార్ధనానికి పొరుగూళ్ళో, ఏదో పనిపడింది. అతడు మురారి ఇంటికి వచ్చి, "రెండు రోజుల్లో తిరిగొస్తాను. మా ఆవిడ ఒంట్లో బాగోలేదు. బజారు నుంచి ఏమైనా కావాలంటే తెచ్చిపెట్టండి," అని మురారికి చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు కచేరీకి పోయే ముందు మురారి, జనార్ధనం ఇంటికి వెళ్ళాడు. జనార్ధనం భార్య, అతడికి ఒక కాగితం యిస్తూ, "అన్నయ్యా, కచేరీ నుంచి వచ్చేటప్పుడు, అందులో రాసి వున్న సరుకులు తెచ్చిపెట్టు," అన్నది.

ఆ సాయంత్రం, అవన్నీ కొని, తేవడానికి, మురారికి రెండు వందల రూపాయిలు ఖర్చయినై. జనార్ధనం పొరుగూరు నుంచి తిరిగి వచ్చాడు. పది రోజులు గడిచినా, ఆ డబ్బు ప్రస్తావన అతడు తేలేదు.

ఇలా లాభంలేదని కామాక్షి, మాధ్యాన్న సమయంలో వచ్చిన జానకితో, "సరుకుల తాలూకూ రెండు వందలు, మీ ఆయన తిరిగి యివ్వనేలేదు!" అన్నది.

అందుకు జానకి ఆశ్చర్యం నటిస్తూ, "ఆ కొద్దిపాటి సరుకులకు రెండు వందలు ఖర్చయాయా? మా ఆయన వంద రూపాయలకు, అంతకు రెట్టింపు సరుకులు తేగలడు!" అన్నది.

ఇది విన్న కామాక్షికి చాలా కోపం వచ్చింది. రెండు రోజుల తర్వాత మురారికి కచేరీ పని మీద పొరుగూరు వెళ్ళవలసి



మురారి, జనార్దనానికి వంద రూపాయలిచ్చి, సంగతి చెప్పి, ఊరికి వెళ్ళిపోయాడు.

మర్నాడు, కామాక్షి ఊహించినట్టుగానే, "బజారు నుంచి సరుకులు ఏమైనా తేవాలా, చెల్లెమ్మా ?" అంటూ జనార్దనం వచ్చాడు.

"వాటికన్న, అతి ముఖ్యమైన పని ఒకటున్నది అన్నయ్యా!" అని కామాక్షి అతడికి ఫలహారం పెట్టి, చీరకొంగుతో కళ్ళొత్తుకుంటూ, "మా ఆయనకి, నా తరఫువాళ్ళంటే బొత్తిగా గిట్టదు. మా తమ్ముడి చదువుకు, సమయానికి మా నాన్న దగ్గిర డబ్బు లేదు. నేను, మా అమ్మ యిచ్చిన బంగారు గాజులు రహస్యంగా అమ్మేద్దామనుకుంటున్నాను. యీ సంగతి, మా ఆయనకు తెలియకూడదు," అన్నది.

బంగారం మాట వింటూనే, జనార్దనం ఆత్రంగా, "ఆ మాత్రం సహాయం చెయ్యలేనా! ఏవీ, ఆ గాజులు వేగిరం పట్రా," అన్నాడు.

కామాక్షి ఒక క్షణం మౌనంగా వూరుకుని, "మరొక యిబ్బంది వచ్చింది, అన్నయ్యా! పట్నంలో మా తమ్ముడు రుసుం కట్టవలసింది యివ్వాళేనట. మూడు వందలు కట్టాలి. శుక్రవారం



వచ్చింది. అతడు బయలుదేరుతున్న సమయంలో కామాక్షి, "మీరు రెండు రోజులకు గాని తిరిగి రారుగదా ! జనార్దనానికి, ఒక వంద రూపాయిలిచ్చి, ఇంటి అవసరానికి, నాకేమైనా కావాలేమో కనుక్కోమనండి," అన్నది.

మురారి కోపంగా, "నీకేమన్నా మతిపోయిందా! ఆ రెండు వందలకే నీళ్ళు వదులుకున్నాం. మరో వంద కూడా సమర్పించుకోమంటావా ?" అన్నాడు.

"మీరేం కోపగించుకోకండి. మనకు రావలసింది, జనార్దనం నుంచి వసూలు చేసే పూచీ, నాది!" అన్నది కామాక్షి నిబ్బరంగా.

రోజున గాజులు అమ్మడం నాకిష్టం లేదు. మరేం చేయాలో నాకు పాలుబోవడం లేదు,'' అన్నది.

ఆ వెంటనే జనార్దనం, ''మీకు, నేను రెండు వందలు యివ్వాలి. మీ ఆయన నిన్ననే వందయిచ్చాడు. ఆ మూడు వందలూ తెచ్చియిస్తాను. డబ్బు మీ తమ్ముడికి పంపించెయ్యి. గాజులు రేపు అమ్మేద్దాం,'' అన్నాడు.

కామాక్షి సరేనంటూ తల వూపగానే, జనార్దనం అప్పటికప్పుడు ఇంటికి పోయి, మూడు వందల రూపాయిలు తెచ్చి యిచ్చాడు.

అమర్నాడు పొద్దున్నే, అతను బంగారు గాజులకోసం వెళ్ళేసరికి, కామాక్షి దిగాలుపడి కూర్చుని వున్నది.

ఆమె, జనార్దనాన్ని చూస్తూనే బావురుమని, ''మా ఇల్లు గుల్లయిపోయింది, అన్నయ్యా! రాత్రి దొంగలు బంగారు గాజులతోపాటు, విలువైన వస్తువులన్నీ దోచుకుపోయారు. కొద్ది రోజులపాటు మమ్మల్ని, నువ్వే ఆదుకోవాలి, అన్నయ్యా,'' అన్నది.

ఆ మాటలు వింటూనే, జనార్దనం వెర్రివాడిలా ముఖం పెట్టి, ''మా అత్త గారికి ఒంట్లో బాగోలేదని కబురు వచ్చింది. పెద్ద వయసు, ఏమవుతుందో ఏమో! ఊరినుంచి తిరిగిరాగానే, మళ్ళీ కనబడతాను,'' అంటూ గబగబా వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నెల రోజులు గడిచినా, జనార్దనం గాని, అతడి భార్యగాని మురారి ఇంటి గడప తొక్కలేదు. బజారులో మురారి ఎదురుపడితే, జనార్దనం ముఖం పక్కకు తిప్పుకోసాగాడు.

''చిన్న నాటకం ఆడి, ఈ జనార్దనం దంపతుల పీడ విరగడచేశావు. మొత్తానికి గడుసైనదానివే!'' అంటూ మురారి, భార్యను మెచ్చుకున్నాడు.

''మీలో వున్న మితిమీరిన మొహమాటం, పూర్తిగా వదిలిపోయేవరకూ, నేను గడుసుగానే వుండాలి. మరి, ఏం చేసేది!'' అన్నది కామాక్షి నవ్వుతూ.





# అణాతో ఐశ్వర్యం

ఒక గ్రామంలో రత్తయ్య అనే పాలేరు ఒక భూస్వామి దగ్గిర పని చేసేవాడు. అతను భూస్వామి పశువులసాలలోనే ఒక మూల పెళ్ళాం బిడ్డలతో కాపరం ఉంటున్నాడు. ఒకనాటి రాత్రి రత్తయ్యతో, అతని భార్య, "ఎన్నాళ్ళు గడిచినా మనకు కడుపుకే జరగకుండా ఉంటే రేపు పిల్లల గతి ఏమయేటట్టు ?" అని అన్నది.

దానికి రత్తయ్య, "వ్యాపారం చేస్తే ఎంత డబ్బయినా సంపాదించవచ్చు. కాని వ్యాపారం చెయ్యాలంటే డబ్బుండాలి. నాకు తెలివితేటలు తక్కువైకాదు— పెట్టుబడికి ఒక్క అణా ఉంటే నెల తిరక్కుండానే వెయ్యి రూపాయలు లాభం చేద్దును. కాని ఆ అణా ఏదీ ?" అన్నాడు విచారంగా.

భార్యా భర్తల మధ్య జరిగిన ఈ సంభాషణ గోడ అవతల ఉన్న భూస్వామి చెవుల పడ్డది. తన పాలెగాడు అణాతో ఏం వ్యాపారం చేస్తాడో, లాభం ఎలా తీస్తాడో చూడాలనుకుని ఆయన గోడమీది నుంచి ఒక అణా కాసు రత్తయ్య గుడిసె పక్క పడేలాగా వేశాడు.

మర్నాటి ఉదయం కసువు ఊడుస్తుంటే ఆ అణా కాసు రత్తయ్య భార్యకు దొరికింది. ఆమె దాన్ని తీసుకుపోయి భర్తకు చూపుతూ, "అణా ఉంటే పెట్టుబడి చేసి లాభం తీస్తానంటివిగా! ఇదుగో అణా!" అని అతడికి ఇచ్చింది.

రత్తయ్య దాన్ని తీసుకుని భూస్వామి వద్దకు వెళ్ళి, "బాబూ, పశువులసాలలో కసువు ఊడుస్తూంటే ఈ అణా దొరికింది. ఇది తమదే అయి ఉంటుంది, తీసుకోండి," అన్నాడు.

భూస్వామి ఆ అణా కాసును అటూ ఇటూ తిప్పి చూసి, "ఇది నాది కాదు.

నీకు దొరికింది గనక నువే ఉంచుకో," అన్నాడు.

రత్తయ్య, "చిత్తం!" అని భూస్వామి వద్ద శలవు పుచ్చుకుని బస్తీకి వెళ్ళాడు. అక్కడ పేదవాళ్లకు చిన్న మొత్తాలు అప్పు లిచ్చే వాళ్లున్నారు. అటువంటివాడి దగ్గిరికి వెళ్ళి రత్తయ్య, "ఈ అణా వడ్డీకింద ముందుగానే తీసుకుని ఒక రూపాయి బదు లివ్వండి. మీ రూపాయి సాయంకాలాని కల్లా తెచ్చి మీ కిచ్చేస్తాను," అన్నాడు.

ఆ మనిషి ఇచ్చిన రూపాయి తీసుకుని, ఇంకొకడి దగ్గిరికి వెళ్ళి వాడికి రూపాయి వడ్డీకింద ముందే ఇచ్చేసి, మర్నాడిస్తానని చెప్పి పదిరూపాయలు అప్పు పుట్టించాడు రత్తయ్య.

ఆ పది రూపాయలూ వడ్డీ కింద తీసుకుని మరో వడ్డీ వ్యాపారి రత్తయ్యకు నూరు రూపాయలు అప్పిచ్చి కాగితం రాయించుకున్నాడు. దాన్ని తీసుకుపోయి రత్తయ్య ఒక పెద్ద వడ్డీ వ్యాపారస్థుడి కిచ్చి, "ఇది వడ్డీ కింద తీసుకుని వెయ్యి రూపాయలు అప్పివ్వండి, వారం రోజుల్లో మీ డబ్బు మీకిస్తాను," అన్నాడు.

వడ్డీ వ్యాపారి రత్తయ్య ఊరూ, పేరూ, అతన్ని ఎరిగిన భూస్వామి పేరూ అంతా విచారించి వెయ్యి రూపాయిలు బదు లిచ్చాడు. ఆ డబ్బు పుచ్చుకుని రత్తయ్య



ఆ రోజే తన నూరు రూపాయల బాకీ, పది రూపాయల బాకీ, రూపాయి బాకీ చెల్లువేసి ఇంటి కొచ్చి తన దగ్గిర మిగిలిన డబ్బు భార్యకు చూపించి, "చూశావా, అణాతో ఎంత డబ్బు పుట్టించానో?" అంటూ తను చేసినదంతా చెప్పాడు.

"ఇదేం సంపాదనా? మళ్ళీ అప్పుల వాళ్ళకు వెయ్యీ కట్టొద్దూ? తొమ్మిది వందలన్నా లేవే!" అన్నది భార్య.

"అసలు వ్యాపారం చేసినాక ఇంత కింత లాభం వస్తుంది. ఇది లాభం కాదు, పెట్టుబడి," అన్నాడు రత్తయ్య.

మర్నాడు తెల్లవారు జామునే బయలు దేరి రత్తయ్య జొన్నవాడ అనే గ్రామానికి

వెళ్ళాడు. ఆ గ్రామం రైతులు జొన్నలు పండిస్తారు. పంట కోతకు సిద్ధంగా ఉంది. రత్తయ్య రైతులందరినీ కలుసుకుని, ''ఈ యేడు మీ పంటంతా నేనే కొంటాను. ఇప్పుడే బయానా లిచ్చేస్తాను. ధాన్యం కొలిచేటప్పుడు నేను చెప్పిన వాళ్ళకు గాని, నాకుగాని కొలవాలి,'' అంటూ తలా యాభై, పాతికా, పరకా బయానా లిచ్చి కాగితాలు రాయించుకున్నాడు. ధాన్యం ధరలో అతను వారికి లోపమేమీ చెయ్యనని మాట ఇచ్చాడు.

రత్తయ్య ఇంటికి తిరిగి వచ్చిన రెండు మూడు రోజులకల్లా ధాన్యపు వర్తకులు వచ్చి, జొన్నపంట యావత్తూ పొలంమీదనే అమ్ముడయిందని విని కంగారు పడ్డారు. జొన్నవాడలో పండే ప్రతి గింజకూ ముందే బయానా ఇచ్చేసిన వాడు ఫలానా గ్రామంలో ఉండే రత్తయ్య అని వర్తకులకు తెలిసింది. వారు అతన్ని వెతుక్కుంటూ వచ్చి, ''మా కడుపు కొడితే నీకేం లాభం? మేము తాతముత్తాతలనాటి నుంచి ఈ ధాన్య వ్యాపారం చేస్తున్నాం. నువు కొత్తవాడివి. అందుచేత దయ తలచి ఆ ధాన్యం మాకు వదిలిపెట్టు,'' అని బతిమాలారు.

''నేనైనా అంత ధాన్యం ఏం చేసుకుంటాను? మారు బేరానికి అమ్ముకోవలిసిందే. వ్యాపార ధర్మం మీకు తెలియనిది కాదు గద. నేను ఇంత ధరకు కొన్నాను. అంతకంటె పెచ్చు వేసి ఆ ధాన్యమంతా నా దగ్గిర నుంచి మీరే కొనుక్కోండి,'' అన్నాడు రత్తయ్య.

వర్తకులు దారికి వచ్చి, రత్తయ్యకు ఒక వెయ్యి రూపాయలు మిగిలేటట్టుగా ధాన్యం ధర నిర్ణయించారు. రత్తయ్య వారి దగ్గిర తీసుకున్న డబ్బులో నుంచి వడ్డీ వ్యాపారస్తుడికి వెయ్యి రూపాయలూ ఇచ్చేసి మిగిలిన వెయ్యీ పెట్టి కొంత పొలం కొనుక్కుని, ఇల్లు కట్టుకుని పెళ్ళాం బిడ్డలతో సుఖంగా జీవించాడు. రత్తయ్య అన్నంతపనీ చేసినందుకు భూస్వామి ఎంతో సంతోషించాడు.



## మరీ అంత క్రూరం కాదు!



తోడేలు మనిషిని చంపిన సంఘటన ఒక్క కెనడాలో మాత్రమే రికార్డయివున్నది. వేటగాడొకడు, తోడేలు చేత కరువబడి, రాబీస్ వ్యాధితో మరణించాడు. తోడేలు, అందరూ అనుకునేంత క్రూరజంతువు కాదు. పిల్ల జంతువులనూ, ముసలివాటినీ, రోగగ్రస్థమైన జంతువులనూ, ముఖ్యంగా కుందేళ్ళనూ, ఎలుకలనూ మాత్రమే తోడేళ్ళు ఎక్కువగా పట్టి తింటాయి.

## బ్రహ్మాండమైన వడగండ్ల వాన!

1970 వ సంవత్సరంలో అమెరికాలోని కాన్‌సాస్ కాఫే విల్లేలో కురిసిన వడగండ్ల వానసమయంలో 17½ అంగుళాలు చుట్టుకొలత గల వడగండ్లు పడ్డాయి!

లండన్ నగరం క్యూ గార్డెన్స్‌లో వున్న సుప్రసిద్ధమైన 'విక్టోరియా' (నింఫీస్) నీటి మొక్కే, ప్రపంచంలోకెల్లా చాలా పెద్దది. నీళ్ళమీద తేలుతూన్న ఈ మొక్క ఆకులు దాదాపు 6½ అడుగుల వ్యాసం కలిగివున్నవి!

## ప్రపంచంలోకెల్లా పెద్ద నీటి మొక్క!



# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాలు నించీ



4 మాసాలు నించీ



6 మాసాలు నించీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

RK SWAMY/FSL/5112/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



Anant Desai



M. Kanyakumari

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కూర్చుని ఆడే ఆట కాదు! రెండవ ఫోటో: ఒడ్డున వుంటే ఈత రాదు!!

పంపినవారు: శ్రీదివ్య C/o సి. వి. సుబ్బారావు, బాపట్ల-522 101 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

